డా॥ బి.ఆర్. అంబేద్కర్ మహత్తర గ్రంథానికి 85 సంవత్సరాలు

# కుల నిర్మూలన కోసం...

## అభిప్రాయాలు - ఆలోచనలు

(వ్యాస సంకలనం)




సంకలనం & సంపాదకత్వం

గౌరవ్

# కుల నిర్మూలన కోసం...

## అభిప్రాయాలు - ఆలోచనలు

### (వ్యాస సంకలనం)




ప్రచురణ :

మే 15, 2021

(డా॥ బి.ఆర్. అంబేద్కర్ మహత్తర గ్రంథానికి
85 సంవత్సరాలు పూర్తవుతున్న సందర్భంగా)

ప్రతిపాదిత విరాళం

ఐచ్ఛికం



ప్రతులకు

9032094492

వివరాలకు

gouravmeka@gmail.com


విజ్ఞప్తి

ఇందులోని వ్యాసకర్తల అభిప్రాయాలన్నింటితోనూ
సంపాదకుడు విధిగా అంగీకరించవలసిన అవసరం లేదు.


Quotations Curtesy

కుల నిర్మూలన, మూలం : బి.ఆర్. అంబేద్కర్,
అనువాదం : బోయి భీమన్న, హెచ్.బి.టి. ప్రచురణ

# అంకితం



ప్రముఖ కుల నిర్మూలనా ఉద్యమ నేత,
ఆత్మగౌరవ పోరాటశీలి,
ద్రావిడ ఉద్యమ నిర్మాత, నాస్తిక తత్త్వవేత్త
ప్రత్యామ్నాయ సాంస్కృతిక యోధ

**'పెరియార్ ఇ.వి. రామస్వామి నాయకర్' కి...**

# విషయ సూచిక

# ప్రస్తావన

కుల సమస్య ఈనాటిది కాదు. కుల నిర్మూలన పోరాటం కూడా ఈరోజే మొదలవలేదు. కులతత్వం ఒక భౌతిక వాస్తవం. దానికి నిర్దిష్టమైన భావజాలం వుంది. నిర్మాణాత్మకమైన తాత్వికత వున్నది. జనంలో లోతుగా జీర్ణించుకుపోయిన బలమయిన విశ్వాసాలున్నాయి. కులాన్ని రక్షించే ఆచార సంప్రదాయాలు వున్నాయి. సంస్కృతి పేరిట వీటన్నింటి్ని కాపలా కాసే మతం వుంది. స్వప్రయోజనాల కోసం మతాన్ని రక్షించే రాజకీయాలు వున్నవి. ఈ రాజకీయాల్ని శాసించే పెట్టుబడిదారులు, సామ్రాజ్యవాదులు, భూస్వాములు వున్నారు.

భారతీయ మనస్తత్వ పరిణామాన్నీ, వృద్ధినీ అర్థం చేసుకోకుండా కులవ్యతిరేక భావజాలం బలపడలదు. వివక్ష మూలాల్నీ, నేపథ్యాన్నీ చారిత్రక దృష్టితో పరిశీలించినపుడు మాత్రమే కులం యొక్క రహస్యం తెలుస్తుంది. కుల నిర్మూలనా ఉద్యమాల ప్రాముఖ్యత బోధపడుతుంది. బహుముఖ రూపాల్లో కులతత్వ సారాన్ని నిర్మూలించడానికి, విస్తృతమయిన విశ్వజనీన ప్రజాతంత్ర విధానాల్ని రూపొందించుకోవడం అత్యవసరమనే భావన కలుగుతుంది.

భావాల మదింపు భౌతిక అన్వయింపుతోనే సాధ్యం. దానినే ఆచరణ అంటాం. ఆ దృష్ట్యా డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ 'కుల నిర్మూలన'కి సంబంధించీ ఒక దార్శనికమయిన సంవాదానికి సంధానంగా ఈయేడు మే 15 నాటికి 85 సంవత్సరాలు పూర్తి చేసుకుంటున్న Annihilation of Caste కి ఇదో చారిత్రక సందర్భం. దానిని పురస్కరించుకుని చేస్తున్న ప్రయత్నమే 'కుల నిర్మూలనకోసం...' అనే ఈ వ్యాస సంకలనం.

ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర సాంస్కృతిక ప్రచారోద్యమంలో భాగంగా ఈసరికే పదికి పైబడిన భిన్న అంశాల వ్యాస సంకలనాలని తీసుకురావడం జరిగింది. ఆ క్రమంలో ఇదో ముందడుగని మా అభిప్రాయం. అనేక కారణాల వలన అనుకున్నంత సమగ్రంగా ఇది రూపుదాల్చలేదు. అదిగో ఇదిగో రాస్తున్నామని నమ్మించిన సన్నిహితులే నెలలకి నెలలు కాలయాపన చేసి చేతులెత్తేయడం ఎంతో బాధ కలిగించింది.

ఇక ఆర్థిక ఇబ్బందెలాగూ ఉండనే ఉంది. కాన కార్యాచరణ వేగం జాగ్రత్తగా క్రమబద్ధీకరించుకోవాల్సి వస్తోంది. సామాజిక కార్యకర్తలకు, యువ ఆలోచనాపరులకు ఈ కృతి ఎంతమాత్రం తోడ్పడ్డా పడ్డ ప్రయాసనంతా సునాయాసంగా మర్చిపోతాను. వ్యాసకర్తలకు, ప్రోత్సాహకులకు ధన్యవాదాలు. భావోద్యమాలకు వెన్నుదన్నుగా ఇంతకంటే మెరుగైన ప్రయత్నాలు భవిష్యత్తులో మరిన్ని జరగాలనీ, జరుగుతాయనీ ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ, కృతిలోకి స్వాగతం. విమర్శలకి ఆహ్వానం. **– సంకలనకర్త**

# 1. అంబేద్కర్ అధ్యయనం ఇక్కడే మొదలు కావాలి

**-దుప్పల రవికుమార్,** బహుజన రచయితల వేదిక, శ్రీకాకుళం

బాబా సాహెబ్ అంబేద్కర్ రచించిన వేలాది పేజీల రచనల్లో ప్రతి విద్యార్థి తప్పక చదవాల్సిన వ్యాసం "ఏనిహిలేషన్ ఆఫ్ క్యాస్ట్". పంజాబుకు చెందిన లాహోరులో ప్రసంగం ఇవ్వవలసి రాసుకున్న ఈ పాఠం అనివార్య కారణాల వల్ల ఆయన ప్రసంగించకుండానే పుస్తక రూపంలో వచ్చింది. 1936లో ఈ పుస్తకాన్ని అంబేద్కర్ రాస్తే, దీనిని తెలుగులోకి తీసుకొచ్చింది మాత్రం 1969లో. ఆ ఏడాది ఇద్దరు దీనిని తెలుగులోకి అనువాదం చేశారు. ఒకరు బోయి భీమన్నగారు, మరొకరు డాక్టర్ యెండ్లూరిగారు. అంతవరకూ అంబేద్కర్ రచనలేవీ తెలుగులోకి రాకపోవడం చాలా విచారకరం. అదే మొదటిది కావడం ఆశ్చర్యకరం. గాంధీ శతజయంతికి అంబేద్కర్ రచన తెలుగులో వెలుగు చూడడం విడ్డూరం. (దీంతో సంబంధం లేకపోయినా చెప్పుకోవలసిన మరో అసంగత సంగతం ఏమంటే 2014లో గాంధీని అంబేద్కర్‌నూ పోలుస్తూ అంతర్జాతీయ పాఠకుల కోసం అరుంధతీరాయ్ రాసిన ఒక ముందుమాటను మాత్రం మన తెలుగువారే కొందరు దునుమాడడం మరో విడ్డూరం). మార్క్సిజం ప్రభావం వలన కమ్యూనిస్టు భావజాలంతో వచ్చిన తెలుగు పుస్తకాలలో కనీసం పాతిక శాతమైనా అంబేద్కర్ రచనల గురించి గాని, అంబేద్కర్ జీవితం గురించి గాని, అంబేద్కరిజం గురించిగాని లేకపోవడం ఇక్కడి అంబేద్కరిస్టులకు సైతం పట్టని విషయం. మన దేశపు గడ్డమీద పుట్టి మన జీవితపు అన్ని పార్శ్వాలనూ, సకల రంగాలనూ ప్రభావితం చేసిన బాబాసాహెబ్ అంబేద్కర్ జీవితకాల కృషిని కమ్యూనిస్టులే కాదు అన్ని రకాల ఇష్టులూ పట్టించుకోకపోవడం భవిష్యత్ తరాలు క్షమించలేని నేరం.

1969 తరువాత బోయి భీమన్న, యెండ్లూరి గార్ల ప్రయత్నాల తరువాత 1991లో హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ఇదే పుస్తకాన్ని తెలుగు పాఠకులకు అందించింది. అంబేద్కర్ రచించిన ఈ వ్యాసం 75 ఏళ్ల ప్లాటినం జూబిలీ సందర్భంగా సౌదాఅరుణ "అంబేద్కర్ వర్ణ నిర్మూలన" పేరుతో ఒక పుస్తకాన్ని ప్రచురించారు. కుల నిర్మూలన అన్న పదానికి ఉన్న తక్కువ పరిధిని, అందులో దాగివున్న కుట్రను అంతకు ముందునుంచే ప్రచారం చేస్తున్న సౌదా అరుణ తెలుగు నేలంతా కలియతిరిగి గాంధీ-అంబేద్కర్ పేర్లమీద ఇక్కడ 'నడుస్తోన్న' భావజాలంలో ఉన్న వైచిత్రిని

తెలియజేస్తూ ఒక నాటకాన్ని ప్రదర్శించారు. 'కుల నిర్మూలన' దృక్పథం ద్వారా క్యాస్ట్ హిందూస్, చీలికలు పేలికలుగా ఉన్న అసంఘటిత బహుజన కులాలను పూర్తిగా అదుపులో పెట్టుకుని, దాదాపు కాలికింద తొక్కిపెడుతున్నారని సౌదా స్పష్టం చేశారు. దానికి ప్రత్యామ్నాయంగా 'వర్ణ నిర్మూలన' దృక్పథాన్ని అలవరచుకోవడం ద్వారా బహుజన కులాలు సంఘటితమవడమే కాకుండా రాజ్యాధికారాన్ని చేపట్టగలవని సూచించారు. నవయాన ప్రచురణ సంస్థ 'ఏనిహిలేషన్ ఆఫ్ క్యాస్ట్' వ్యాసానికి అరుంధతీ రాయ్ ముందుమాటను కలిపి, ఎస్ ఆనంద్ చేర్చిన చాలా వివరమైన టీకాటిప్పణితో 2014లో వెలువరించింది.

అక్కడికి ఏడాదికి (2015) తెలుగులో అలాంటి లేదా అంతకుమించి లోతైన, విపులమైన విషయ వివరణతో సౌదాఅరుణగారే అదే పేరుతో ఒక బృహద్గ్రంథాన్ని 720 పేజీలతో వెలువరించారు. అంబేడ్కర్ రచనలకు ఒక ప్రామాణికతను, సంక్లిష్టరాహిత్యతను అందించిన పేరాగ్రాఫ్ నెంబరింగును పాటించక పోవడం తప్ప మిగతా ఎంచడానికి వీలులేని విధంగా సౌదా ఈ గ్రంథాన్ని తీసుకొచ్చి తెలుగు పాఠకులకు సమాచార గని అందించి, అంబేడ్కర్ అధ్యయన కరదీపికను సిద్ధం చేశారు. అంబేడ్కర్ రచనల అనువాదానికి కొత్త ఒరవడి తయారుచేసారు. తెలుగు పాఠకులకు మరింత సమాచారం అరటిపండు వొలిచిపెట్టినట్టు చెప్పాలన్న కుతూహలం, రాజకీయ జ్ఞానాన్ని అందివ్వాలన్న ఆకాంక్ష ప్రతి వాక్యంలో కనిపిస్తాయి. ఇవీ ఇప్పటివరకు ఈ "ఏనిహిలేషన్ ఆఫ్ క్యాస్ట్" వ్యాసం మీద తెలుగులో జరిగిన ప్రయత్నాలు. ఇప్పుడు గౌరవ్ ఈ వ్యాసాన్ని మరికొంతమంది ఎలా అర్థం చేసుకున్నారో తెలిపే వ్యాసాలతో ఇలా మరో ప్రయత్నం చేస్తున్నారు.

బాబాసాహెబ్ ఈ వ్యాసం ఎవర్ని ఉద్దేశించి రాసారో తెలుసుకునే ముందు ఆయన వాడిన క్యాస్ట్ హిందూస్ అంటే మనం ఒక అభిప్రాయానికి రావాలి. హిందువులలో కులం ఉన్నది ఆ ముగ్గురికే. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలే హిందూ కులాలంటే. మిగిలిన వారంతా కులహీనులే. సామాజిక స్తరంలో అట్టడుగున మిగిలి, ఆత్మగౌరవంతో సహా అన్నింటికీ దూరం చేయబడిన సమస్త ఉత్పత్తి కులాలైన బహుజన శ్రేణులన్నీ (ప్రస్తుత మన భాషలో ఎస్సీ ఎస్టీ బీసీలందరూ) కులం కాన్వాసులో లేనివారే. అప్పటివరకు కూటికీ గూడుకూ గుడ్డకూ అక్షరానికీ దూరమైన బహుజన కులాలను మతానికి ఆలంబనగా నిలిపిన పురాణాలు, ఇతిహాసాలు,

స్మృతులు వంటి కల్పనాత్మక సాహిత్యం సాయంతో పూర్తిగా 'కంట్రోల్'లో ఉంచారు ఈ మూడు కులస్తులు (త్రివర్ణాలు లేదా క్యాస్ట్ హిందూస్). మైనారిటీ సంఖ్యలో ఉన్న ఆ మూడు కులాల ప్రజలు మెజారిటీ సంఖ్యలోని బహుజనులను పూర్తిగా శాసించి వేలాది సంవత్సరాలుగా పబ్బం గడుపుకొంటూనే ఉన్నారు. వారి మాయోపాయాన్ని తెలుసుకునే తెలివీ అవగాహనా లేని శ్రేణులు నిరంతరం నిద్ర మత్తులోనే ఉండాలని క్యాస్ట్ హిందూస్ కోరుకుంటారు. అలా ఉండడమే కరెక్ట్ అనుకుంటున్న బహుజనులు ఇప్పటికీ ఉండడమే అసలు విషాదం. అగ్ర వర్ణాలు లేదా దోపిడీ కులాలు లేదా త్రివర్ణాలు లేదా బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య కులాలే ఈ క్యాస్ట్ హిందూస్.

అంబేడ్కర్ విరచిత ప్రసంగ వ్యాసం "కుల నిర్మూలన" ఇతర మతస్తుల కోసం కానేకాదు. కేవలం హిందువుల కోసం. అందులో హిందూ మతం గొప్పదని భావించేవారి కోసం. సమానత్వ భావన ఈ మతంలో అడుగడుగునా ఉంటుందని నమ్మేవారి కోసం. అమాయకుల కోసం కాదు, అమాయకత్వం నటించేవారి కోసం. వారినే ఫ్రెండ్స్ అంటూ సంబోధిస్తూ ఈ వ్యాసం మొదలవుతుంది. హిందూ మతంలో కొంత చెడు ఉందని అమాయకంగా నమ్మే మరికొందరు, ఇంట్లో కలప వస్తువులకు చెద పట్టినప్పుడు పెస్ట్ కంట్రోల్ ట్రీట్‌మెంట్ చేసి ఆ చెదను తొలగించే విధంగా చిన్నా చితకా సంస్కరణల ద్వారా హిందూమతాన్ని లోపాలు లేని మతంగా చేసెయ్యవచ్చని భ్రమపడుతుంటారు. అలాంటి భ్రమల్లో జోగుతున్న వారిని అప్రమత్తం చేయడానికి ఈ వ్యాసాన్ని చదవాలి. ఆ భ్రమలు పటాపంచలు చేయడానికి ఈ వ్యాసం ఉద్దేశించబడింది. వారే దీని నిజమైన పాఠకులు.

మొత్తం 26 అధ్యాయాలుగా ఉన్న ఈ వ్యాసంలో కొన్ని వ్యాసాలు చాలా చిన్నవి కాగా మరికొన్ని ఒక మోస్తరు పెద్దవి. మొత్తమ్మీద ఏ అధ్యాయం కూడా పది నిముషాలలోపే చదవగలిగే వ్యాసాలే కావడం చేత విద్యార్థులంతా ఈ పుస్తకాన్ని శ్రద్ధగా చదవాలి. కొన్ని వ్యాసాలు చదివి అదే మొత్తం ఉపన్యాసం సారాంశం అని భ్రమించకూడదు. ప్రస్తుతం తెలుగు పత్రికలలో వస్తోన్న సమీక్షలు పుస్తకం ఆసాంతం చదవకుండా, అక్కడక్కడా చదివేసి నాలుగు వాక్యాలు రాస్తే సరిపోతాయన్నట్టుగా ఉంటున్నాయి. సమీక్షలు లేదా పుస్తక పరిచయాలకు సంపాదకులు తగిన జాగా ఇవ్వడం లేదన్న నెపంతో పుస్తకం చదవకుండానే పరిచయాలు రాస్తున్నారు. ఈ

వ్యాసం చదివేటప్పుడు మాత్రం ఆ పొరపాటు చెయ్యకూడదు. ఆసాంతం ఒకసారి చదివేసి, ఆ తరువాత ఒక్కో అధ్యాయానికి నెమ్మదిగా నోట్సు రాసుకుంటూ చదవడం ద్వారా అంబేద్కర్ అధ్యయనంలో మొదటి మెట్టు దిగ్విజయంగా అధిరోహించి నట్టవుతుంది.

ఈ వ్యాసం ఎవరిని ఉద్దేశించి రాశారో మొదటి అధ్యాయంలో అంబేద్కర్ తెలియజేశారు. జాత్‌పాత్ తోడక్ మండల్ సభ్యులే కాదు, ఆ భావజాలం ఉన్న ప్రతి హిందువు దీనిని చదవాలి. రెండవ అధ్యాయంలో హిందూ మతాన్ని సంస్కరించాలనుకోవడం గురించి ప్రస్తావిస్తారు. ఇది సంఘ సంస్కరణ కాదని, సొంత ఇంటి సంస్కరణ అని ఈసడిస్తారు. మనసూ బుద్ధీ విముక్తి చెందిన తరువాతే ఏ జాతికైనా రాజకీయ అధికారం సిద్ధిస్తుందని ఉదాహరణలతో చెప్తారు. మహమ్మద్ ప్రవక్త మత విప్లవం తరువాతే అరబ్బులు రాజకీయ శక్తిగా ఆవిర్భవించారని, బుద్ధుడి సామాజిక విప్లవం తరువాతే చంద్రగుప్తుడి రాజకీయ విప్లవం మొదలైందని, మహారాష్ట్రలో భక్తి ఉద్యమకారుల కృషితోనే శివాజి అధికార పాలన మొదలైందని, గురునానక్ సామాజిక మత విప్లవమే సిక్కుల రాజకీయ విప్లవంగా తీరు మార్చుకుందని ఉదహరిస్తారు. మూడో అధ్యాయంలో సోషలిస్టులను ప్రస్తావిస్తారు. కుల సమస్యపై అంబేద్కర్ ఫేమస్ కోట్ ఈ అధ్యాయం చివరిలోనే ఉంటుంది. మీరే మార్గంలో ప్రయాణించినా మీకెదురయ్యే మహా రాక్షసి ఈ కులం. ఈ రక్కసిని సంహరించకుండా మీరు రాజకీయ సంస్కరణలూ చెయ్యలేరు, ఆర్థిక సంస్కరణలూ చెయ్యలేరు.

నాలుగో అధ్యాయంలో కుల వ్యవస్థను గుడ్డిగా సమర్థించే వారి అమాయకత్వాన్ని ప్రస్తావిస్తారు. శ్రమ విభజన ద్వారా కులాలు ఏర్పడ్డాయని నమ్మేవారు ఇప్పటికీ ఉండడం విషాదం. సమాజంలో ఒక ఆర్డర్ ఉండడానికి, కొనసాగడానికి ఈ రకమైన శ్రమ విభజన ఎంతో మంచిదని, ఇలా ఉండడం వల్లనే ఎన్ని వందల సంవత్సరాలైనా హిందూ మతం చెక్కు చెదరలేదని వీరి అభిప్రాయం. ఈ ఆలోచనలోని డొల్లతనం ఈ అధ్యాయంలో చూడొచ్చు. ఇది శ్రమ విభజన కాదని, శ్రామికుల విభజన అని చెప్పడానికి ప్రయత్నిస్తారు. ఇక అయిదవ అధ్యాయంలో కుల వ్యవస్థ ఉండాలనుకున్న వారు చెప్పే మరొక బిత్తిరి కారణాన్ని అంబేద్కర్ ప్రస్తావిస్తారు. జాతి పవిత్రతనూ, రక్తం పవిత్రతను కాపాడడానికే

కులం ఉందని చెప్పడం ఎంత నవ్వు తెప్పించే వాదనో వివరిస్తారు. ఎథ్నాలజీ, యుజెనిక్స్ శాస్త్రాల పరంగా ఇందులో డొల్లతనాన్ని చెప్తారు. ఆరవ అధ్యాయంలో విదేశీయులు పెట్టిన పేరుతో హిందూ మతమని పిలిపించుకున్న ఈ మతంలో భిన్నత్వంలో ఏకత్వం ఉందని అరమోడ్పు కనులతో కొందరు పరవశించిపోతుంటారు కదా, ఇందులోని వైరుధ్యాన్ని వివరిస్తారు. పైగా ఇక్కడి కులం హిందువులను ఎంతగా విడదీసిందో, ఎంత పతనం గావించిందో తెలుసుకోవాలంటారు. ఏడవ అధ్యాయంలో హిందూ మత గ్రంథాలలో కొన్ని కులాలు ఎంత గొప్పవో, మరికొన్ని ఎంత హీనమైనవో ఏకరువు పెట్టడమే పనిగా పెట్టుకుంటాయని విసుక్కుంటారు. అసాంఘిక లక్షణం (ఏంటీ సోషల్ స్పిరిట్) ప్రముఖంగా హిందూమతంలో కనిపిస్తుందంటారు.

ఎనిమిదవ అధ్యాయంలో గిరిజనుల గురించి ప్రస్తావిస్తారు. గిరిజన మూలవాసులను పట్టించుకోవడమంటే వాళ్లను మన మనుషులనుకోవడం. ఎలాంటి పశ్చాత్తాపం లేకుండా, ఎలాంటి సిగ్గూఎగ్గూ లేకుండా నాగరికులమని మిడిసిపడుతూ గిరిజనులను ఆటవికులగానే కొనసాగనిస్తున్నారంటే దానికి పూర్తి బాధ్యత మన కుల వ్యవస్థదే నంటారు. తొమ్మిదవ అధ్యాయంలో దిగువ కులాల గురించి ప్రస్తావిస్తారు. మహమ్మదీయులు క్రూరులని చెప్పడానికి గాని, హిందువులు అల్పాత్ములు అని చెప్పడానికి గాని తనకు మొహమాటం లేదంటారు. క్రూరత్వం కన్నా అల్పత్వమే మరింత క్రూరమైనదంటారు. హిందూ మతానికి మిషనరీ స్వభావం ఉందో లేదోనని పదవ అధ్యాయంలో చర్చిస్తారు. కుల వ్యవస్థ కుదురుకోగానే ఈ దేశంలో హిందూమతం ప్రచారానికి స్వస్తి చెప్పడానికి కారణం, కులం పుట్టుకతో వస్తుందని, మార్పిళ్లు మరి కుదరక పోవడమేనని బాబాసాహెబ్ చెప్తారు. 'శుద్ధి చేయడం' ఎంత అసాధ్యమో, హిందూ మతంలో 'సంఘటన' కూడా అంతే అసాధ్యమని తర్వాతి పదకొండవ అధ్యాయంలో చెప్తారు. కరడుగట్టిన కుల వ్యవస్థ కట్టుబాట్లను అతిక్రమించిన వారికి వెలిని ఉరిశిక్షలాగా విధిస్తుంది. సంప్రదాయ వాదుల చేతుల్లో కులం ఎంత పదునైన ఆయుధంగా మారుతుందంటే అది సంస్కర్తలనే బలి తీసుకుంటుంది, అది సంస్కరణనే సంహరిస్తుందని పన్నెండవ అధ్యాయం చెప్తుంది.

ఈ కుల వాదులకు ప్రజలంటే తమ కులంవారు తప్ప వేరేవారు కాకుండా పోయారని పదమూడవ అధ్యాయంలో అంబేడ్కర్ వాపోతారు. ఈ కులం సామాజిక

స్పృహను, ఉపకార గుణాన్ని, ప్రజాభిప్రాయాన్ని దుంప నాశనం చేసిందని అంటారు. తప్పయినా ఒప్పయినా, మంచి అయినా చెడు అయినా అంతా తమ కులం వారేనన్నంత సంకుచితంగా మనుషులను మార్చిందని చెప్తారు. ఇంతవరకూ విమర్శించిన విషయాలను కాస్త పక్కన పెట్టి ఇక మనం చేయవలసిన దానిగురించి ఆలోచించడానికి బాబాసాహెబ్ ఉద్యుక్తులవుతారు. పద్నాలుగవ అధ్యాయంలో స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం తనకు ఆదర్శాలుగా చెప్పుకుంటారు. మనుషులు తాము సహించలేని వృత్తులను బలవంతంగా, వంశ పారంపర్యంగా చేస్తూనే ఉండడం మన కుల వ్యవస్థ మనకు అలవాటు చేసింది. శారీరక వారసత్వం, సామాజిక వారసత్వం, కాయకష్టం ఈ మూడింటి గురించి ఈ అధ్యాయంలో ప్రస్తావిస్తారు. శారీరక వారసత్వం, వంశ ప్రతిష్ట, విద్యావకాశాలు, వ్యాపార వాణిజ్య సంబంధాలు, పిత్రార్జిత సంపద వీటన్నిటినీ పుట్టుకతోనే అందిపుచ్చుకున్న వ్యక్తులే పోటీలో నెగ్గుతారనేది స్పష్టం. ఇందువల్లనే నెగ్గినవాడల్లా అర్హుడని అనుకోకూడదు. నెగ్గనివారిలో అనేకమంది ఆ అవకాశాలకు దూరమవడం వల్ల పోటీలోనే పాల్గొనలేకపోతున్నారు. దీనిని సమానత్వం అనీ, పూర్వజన్మ ప్రారబ్దం అనీ, పుట్టుక అనీ, మరొకటనీ కులవ్యవస్థ సమర్థిస్తుంది.

పదిహేనవ అధ్యాయంలో అంబేద్కర్ మరో కొత్త కోణాన్ని ప్రస్తావిస్తారు. అమానుషమైన కుల వ్యవస్థ కేవలం పుట్టుక కారణంగా మనుషులను మూడు కులాల చట్రంలో జీవిత పర్యంతం బంధించి ఉంచడాన్ని అసహ్యించుకున్న వారిని హిందూమతం నుంచి బయటకు పోకుండా ఒక సేఫ్టీ వాల్వ్‌లాగా పనిచేసేదే ఆర్య సమాజం. మనిషి పుట్టుకమీద కాకుండా, గుణం మీద ఆధారపడి మనుషులను నాలుగు గుణ-వర్ణాలు (చాతుర్వర్ణ వ్యవస్థ)గా విభజించడం వీరి ప్రత్యేకత. కొత్త రిజిస్టర్ తెచ్చి, అందులోకి శూద్రులను ఎంటర్ చేయడమైతే చేశారు గాని, మనసులో వివక్ష మాత్రం మునుపటి మాదిరిగానే కొనసాగుతుంది. నిజానికి అది వ్యవస్థ కాదని, ఒక వల (స్నేర్) అని అంబేద్కర్ అంటారు. పదహారవ అధ్యాయంలో మరింత పదునుగా, నిశితంగా ఆర్య సామాజికుల చతుర్వర్ణ వ్యవస్థను బాబాసాహెబ్ ఎండగడతారు. మహిళలలకు ఈ సిస్టంలో అప్‌డేషన్‌కు చోటులేకపోవడమే కాదు, వర్ణ అతిక్రమణ చేసిన వారికి శిక్షలు గరించి కూడా స్పష్టత లేకపోవడాన్ని గమనించాలి. ఇరవయ్యో శతాబ్దంలో సైతం అనాగరిక మనుస్మృతిని ప్రచ్ఛన్నంగా అమలు చేయబూనడాన్ని ఈసడించుకుంటారు.

పదిహేడవ అధ్యాయంలో మన మెదడును మరింత పదును తేర్చడానికి అంబేద్కర్ ప్రయత్నం చేస్తారు. పెట్టుబడిదారులు దోపిడీకి పాల్పడినప్పుడు, కార్మికుల హక్కులను కాలరాస్తున్నప్పుడు ప్రతిఘటన చెలరేగుతుంది. ధనికులకీ పేదలకీ మధ్య యూరప్‌లో హింసాత్మక యుద్ధం జరుగుతోంది. ఆ జ్వాలలు ఎగసి ఇతర దేశాలకు సైతం అంటుకుని రాజుకుంటున్నాయి. కాని మన దేశంలో ఆ ప్రమాదం లేదు. సమస్త శూద్ర కులాల ప్రజలను నిస్సహాయులను చేసి ఆధిపత్య కులాలు నిస్సిగ్గుగా దోపిడీ చేస్తున్నప్పటికీ భారతదేశంలో విప్లవం రానే రాదు. ఇక్కడి చాతుర్వర్ణ వ్యవస్థ ఆ స్పృహను చాలా తెలివిగా మాయం చేసింది. బాధిత కులాలు సంఘటితం అయ్యే అవకాశం లేకుండా, ఒకవేళ అలాంటి అవకాశం ఛాయామాత్రంగా తలెత్తినా దానిని సమూలంగా హతమార్చే వ్యవస్థ మనది.

అయితే సంపూర్ణ కుల నిర్మూలన జరిగిన కాలం ఒకటి చరిత్రలో ఉన్నది. అది మౌర్యుల పాలన కాలం. శూద్రులు ఎరుక తెచ్చుకుని, పాలకులుగా మారిన కాలమది. మన దేశ చరిత్రలో గర్వించదగిన రోజులవి. మిగిలిన కాలమంతా విస్తార జన బాహుళ్యమైన సమస్త శూద్ర కులాలన్నీ కుల వ్యవస్థ కరాళదంష్ట్రల నడుమ నలుగుతూ, పరాజయాల కింద కుంగుతూ, చీకటిలో మూల్గుతూ మగ్గుతూ గడిపిందే.

పద్దెనిమిదవ అధ్యాయంలో ఆధిపత్య కులాలు శూద్ర కులాలను పీడించడం తోనే సరిపెట్టుకోవని, వారిలో వారికే జరిగే ఆధిపత్య పోరులో బ్రాహ్మణులు, క్షత్రియులు ఒకరినొకరు చంపుకోవడాన్ని ఉదాహరణలతో వర్ణాల మధ్యనున్న వైషమ్యాలను అంబేద్కర్ మహాశయుడు ఎత్తిచూపిస్తారు. పంతొమ్మిదవ అధ్యాయంలో సర్వేపల్లి రాధాకృష్ణ రాసిన 'హిందూ వ్యూ ఆఫ్ లైఫ్' అన్న పుస్తకం నుంచి పెద్ద ఉటంకింపు ఇచ్చి, శాశ్వత జీవనంగా అతనికి కనిపించేది, నిజానికి శాశ్వతంగా నశిస్తున్న జీవితమని అంబేద్కర్ తేల్చేస్తారు. కులమే హిందూ మతపు సారాంశమని, ఇతర మతాలతో పోలుస్తూ నిరూపించేది ఈ అధ్యాయంలోనే.

మరొక ప్రఖ్యాత కొటేషన్ మనకు ఇరవయ్యవ అధ్యాయంలో ఎదురవుతుంది. "కులం పునాదులపై దేన్నీ నిర్మించలేరు. ఒక జాతినీ నిర్మించలేరు, ఒక నీతినీ నిర్మించలేరు. కులం పునాదిపై దేనిని నిర్మించినా బీటలు వారక తప్పదు. అది సంపూర్ణమూ కానేరదు". ఇక అక్కడనుంచి ప్రగతి నిరోధకమైన, అమానవీయమైన

కులాన్ని రద్దు చెయ్యడం గురించి అంబేద్కర్ తన ఆలోచనలను సారిస్తారు. కులాలు పోవడానికి గుంపుగా అన్ని కులాలు కలిసి భోజనాలు చేసే పద్ధతి ఒక మార్గమని కొందరు ఆచరించడం, ప్రచారం చేయడం ఒక ఉబుసుపోని వ్యవహారమని బాబాసాహెబ్ అంటారు. కులాంతర భోజనాల కంటే కులాంతర వివాహాలు ఈ దిశగా మరింత మేలని ఈ సందర్భంగా ఆయన అభిప్రాయపడతారు. అయితే ఒక మనిషి మరో మనిషిని హీనంగా చూసే అమానవీయ సంస్కారం ఉన్న కుల వ్యవస్థకు మూలాధారమైన హిందూ మత గ్రంథాలను నిరసించాలి అని స్పష్టంగా కుండబద్దలు కొట్టినట్టు చెప్తారు. ప్రగతిశీల సమాజం చీదరించుకునే విశ్వాసాలను, అభిప్రాయాలను మనుషుల్లో ప్రోదిచేసే ఈ శాస్త్రాలను మట్టి గరిపించనిదే మన దేశంలో మానవత్వానికి మనుగడ లేదు. మార్చవలసిందాన్ని బుద్ధుడు మార్చినట్టు, గురునానక్ మార్చినట్టు మార్చాలి. మనం శాస్త్రాలను త్యజించినంత మాత్రాన చాలదు. బుద్ధుడు చేసినట్టు గురునానక్ చేసినట్టు ఆ శాస్త్రాల అజమాయిషీని అంతం చెయ్యాలి. ఆ ధైర్యం మనకు ఇవ్వడానికే ఈ గొప్ప ఆలోచన ధారను మనకు బాబాసాహెబ్ అందించారు.

ఇరవై ఒకటో అధ్యాయంలో అంబేద్కర్ కుల నిర్మూలన బ్రాహ్మణులతో మాత్రం సాధ్యం కాదని నిరూపిస్తారు. ఆధిపత్య కులాలు కుల నిర్మూలన జరగాలని కోరుకుంటే, వారి కాళ్లకింద నేల కదిలిపోతుంది. ఉత్పత్తిలో పాల్గొనకుండా తేరగా తిని కూర్చోవడం సాధ్యం కాకుండా పోతుంది. పైగా వారి ఆధిపత్యానికి గండి పడుతుంది. సమాజాన్ని తమ గుప్పిట్లో బంధించిన మేధావుల తరగతి కుల నిర్మూలనకు అడ్డంగా ఉండడం వల్ల కుల వ్యవస్థను నిర్మూలించే ఏ ఉద్యమమైనా విజయం సాధించగల అవకాశాలు నాకు ఏ కోశానా కనపడడం లేదని ఆవేదనతో తల్లడిల్లిపోతారు. ఇరవై రెండవ అధ్యాయంలో మన మతం మనకు విధించిన పరిమితులను, ఆంక్షలను వివరిస్తూ కుల నిర్మూలనకు అసలైన దారిని సూచిస్తారు. హిందూమతంలో మనిషి నడుచుకోవడానికి వేదాలు, స్మృతులు, సదాచారం అనే మూడు అంశాలను పెద్దలు చూపించారు. దురదృష్టవశాత్తూ ఈ మూడు హేతువును ప్రోత్సహించవు. మనిషికి సొంత ఆలోచన లేకుండా చేసేవే ఈ మూడు కూడా. నైతికత గురించి సొంత బుద్ధితో ఆలోచించ లేనప్పుడు, అదే నైతికత పేరు చెప్పి హిందువులను కులనిర్మూలన కోసం ఎట్లా సిద్ధం చేయగలరని అంబేద్కర్ హిందువులను ప్రశ్నిస్తారు. దానికి సమాధానం కూడా ఆయనే చెప్తారు. హేతువును,

నైతికతను హతం చేసిన వేదాలకు, శాస్త్రాలకు, స్మృతులకు డైనమైట్ పెట్టి పేల్చేయమంటారు.

హిందూ మతం నిజానికి ఒక చట్టంలాంటిది, అంతా విధి నిషేధాలతో కూడి ఉంటుందని ఇరవై మూడో అధ్యాయంలో నిరూపిస్తారు. అయితే ఆధిపత్య కులాలు అది చట్టం రూపంలో కాకుండా, ధర్మం ముసుగు వేసి మార్చడానికి వీలు లేని మతంగా చేశారు. చట్టాలు మార్చే వీలున్నవి. మతం ఒక చట్టం లేదా శాసనమని ప్రజలకు తెలిసిపోయినప్పుడు దానికి వేసిన ముసుగును ప్రజలు చీల్చి చెండాడుతారు. ఇరవై నాలుగో అధ్యాయంలో హిందువుల వేదికపై తానిక ప్రసంగించనని ప్రకటిస్తారు. మనకు ఇష్టం ఉన్నా లేకపోయినా ఒక నీతి అందరికీ వర్తించినప్పుడు మాత్రమే ఆ జాతి తిరుగులేని జాతిగా అవతరిస్తుంది, యావత్తు జాతి అనుసరించలేని నైతికత మనకెంత నచ్చినప్పటికీ ఆ జాతి అదృశ్యం కాక తప్పదని బాబాసాహెబ్ హెచ్చరిస్తారు ఈ ఇరవై అయిదో అధ్యాయంలో. గతాన్ని వదిలించుకుని, మార్పును స్వాగతించు కుంటూ అందరినీ కలగలుపుకొంటూ సాగడమే ఆ జాతి ఉజ్వల భవితకు మేలు చేస్తుందని చెప్తారు. ఇక చివరిదైన ఇరవై ఆరవ అధ్యాయంలో దేశ స్వాతంత్ర్యం సవర్ణ హిందువుల ఆశయమని, కులం లేని సమాజం ఈ దేశపు బడుగు జీవుల అవసరం అని, దీనికోసం ఎన్ని కష్టాలు ఎదుర్కొనైనా ఈ ఆధిపత్య భావజాలం పోయేవరకు అంటే కుల నిర్మూలన కోసం తాను పోరాటం చేస్తానని ప్రకటిస్తారు.

అంబేడ్కర్‌ను అర్థం చేసుకోవడానికి ప్రతి ఒక్కరూ మొదట ప్రారంభించవలసిన రచన ఈ "ఏనిహిలేషన్ ఆఫ్ క్యాస్ట్". ఈ చిన్న వంద పేజీల పుస్తకాన్ని చదివిన తరువాతే ఆయన ఇతర రచనలు చదవడం మనకు ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది.

***

"నీవు ఏ దిక్కుకు తిరిగినా సరే, దారికడ్డంగా నిలబడే పెనుభూతం కులవ్యవస్థ. ఈ భూతాన్ని చంపి పారవేస్తే తప్ప నీవు రాజకీయ సంస్కరణగాని, ఆర్థిక సంస్కరణ గాని సాధించలేవు."

# ౨. బి.ఆర్. అంబేడ్కర్ రచన-'కుల నిర్మూలన' గురించి...

**- డా॥ అంబూరు సుబ్రహ్మణ్యం,** సమాంతర ఫౌండేషన్, నెల్లూరు

తాము జీవించిన కాలంలో సామాజిక వికాసానికి ఆటంకంగా ఉన్న అంశాలపై ఆందోళన చెంది, వాటిని తొలగించడానికి దృఢ సంకల్పంతో కృషిచేసినవారే సంస్కర్తలు. తమ లక్ష్యసాధన క్రమంలో వారు ప్రదర్శించిన అకుంఠిత దీక్ష, అసమానత్యాగం వారిని నిజమైన సంస్కర్తల కోవలోకి చేరుస్తుంది.

సమస్యను గుర్తించడమే గాక దాని మూలాలను శోధించి, దానికి శాస్త్రీయమైన పరిష్కారాన్ని సాధించడంలో వారు ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొని నిలబడి ఒక మార్గం చూపి, ఆ మార్గం వెంట ఒక ఉద్యమాన్నే నిర్మించడం అనేది వారిని మహోన్నతుల జాబితాలో చేరుస్తుంది. అదే విధంగా సమస్య పరిధిని బట్టి వారు ప్రజలకు దగ్గరవుతారు. చరిత్రలో గుర్తుండిపోతారు.

ఈ 'పరిధి' అనేది సంస్కర్తల స్థానాన్ని నిర్ణయిస్తుంది. ఉదాహరణకు రాజారాం మోహన్‌రాయ్. దయానంద సరస్వతి, కందుకూరి వీరేశలింగం చేపట్టిన సమస్య తమ తమ వర్గాలలోని కుటుంబాలకు చెందిన ఆచారాలకు సంబంధించినది కాగా మహాత్మా జ్యోతిరావ్ ఫూలే, డా॥ బి.ఆర్. అంబేడ్కర్‌లు చేపట్టిన సమస్యలు విస్తృత సమాజానికి విశ్వసమాజానికి సంబంధించినవి ఈ అంశమే వారిని ఒక సమున్నత స్థాయిలో నిలబెట్టింది. గౌతమ బుద్ధుడిని, జ్యోతిభాఫూలేని కబీర్‌ని తన మార్గదర్శకులుగా ప్రకటించుకుని భారత సమాజంలో అత్యధికులు ఎదుర్కొంటున్న కుల వివక్షతను, ఘోరమైన అణచివేతకు గురి చేస్తున్న అంటరాని తనాన్ని నిర్మూలించడాన్ని తన లక్ష్యంగా స్వీకరించి దానికి విస్తృతమైన వ్యాప్తిని అద్దిన అరుదైన వ్యక్తి డా॥ బాబాసాహెబ్ అంబేడ్కర్ (1891-1956). నిజమైన సంఘ సంస్కర్త.

సమస్య పరిష్కారానికి డా॥ అంబేడ్కర్ ప్రతిపాదన కుల-వర్ణ నిర్మూలన. ఆయన ఊహించినది సమతా సమాజం. ఆయనది స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వంలు ప్రాతిపదికగా గల సమతా సిద్ధాంతం. దీనికి ఆటంకమవుతున్న బ్రాహ్మణీయ హిందూ భావజాలం, అసమకులవ్యవస్థ, అంటరానితనంలను తరిమికొట్టాలన్నాడు. ఈ క్రమంలో ఆయన సమస్య మూలాలలోకి వెళ్ళాడు.

సమస్య చాలా క్లిష్టమైనది. తను సూచించిన మార్గం సమాజంలో ఉన్న అవగాహనకు పూర్తిగా వ్యతిరేకమైనది. దాంతో ఆయన హిందూ బ్రాహ్మణ పండితులను, సాంప్రదాయక విలువలను, నమ్మకాలను ఎదుర్కొనవలసి వచ్చింది. వారు ప్రచారంలో పెట్టి ఉన్న శాస్త్రాల గుట్టును, బయటపెట్టవలసి వచ్చింది. ఆ మాయలో నుండి ప్రజలను బయట పడవేయవలసి వచ్చింది. చరిత్రకు కాల్పనిక సాహిత్యానికి గల తేడాను ఎత్తి చూపించవలసి వచ్చింది. ఇంత భారమూ ఆయన భుజాలపై పడింది. మహాత్మా జ్యోతిబాఫూలే ప్రారంభించిన మార్గాన్ని ఎంతో శ్రమతో ముందుకు తీసుకుపోవలసి వచ్చింది. శత్రువు ఎంతో బలవంతుడు. ఆ శత్రుపూరిత వాతావరణాన్ని ఒంటి చేత్తో ఎదుర్కొనవలసి వచ్చింది. తన సమాజం నుండి సహకారం అంతంత మాత్రమే. కాగా కొన్ని సందర్భాలలో వ్యతిరేకతను కూడా చవిచూశాడు. ఇన్ని అవరోధాలను ఎదుర్కొంటూ మైనారిటీ వర్గాలైన శూద్రులు, అతిశూద్రుల కోసం పోరాటం చేశాడు. ఒక చారిత్రక కర్తవ్యాన్ని స్వీకరించాడు.

ఈ మొత్తం వ్యవహారంలో బాబాసాహెబ్‌కు కలసివచ్చిన అంశాలు కొన్ని ఉన్నాయి. ఉన్నత విద్యకోసం అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ వంటి దేశాలకు వెళ్ళి తన అవగాహనను, విస్తృతం చేసుకున్నాడు. కరుడుగట్టిన బ్రాహ్మణీయ హిందూ భావజాలం, దాని తాలూకు పెత్తనం, అవమానాలు, అణచివేతలకు అలవాటుపడిన తరగతి నుండి వచ్చిన ఆయన అక్కడ ఎంతో స్వేచ్ఛ, సోదరభావం ప్రతిఫలించే సమాజాన్ని చూశారు. ఆనాడు ప్రపంచవ్యాప్తంగా ప్రచారంలో ఉన్న ఉదారవాదం, సోషలిజం, కమ్యూనిజం, ప్రజాస్వామ్య భావజాలాలను అవగాహన చేసుకున్నాడు. ఇవి భవిష్యత్తులో ఆయన సాగించబోయే ఉద్యమానికి కరదీపికలైనాయి.

సమస్యకు శాస్త్రీయమైన పరిష్కారం కావాలి. అందుకు విస్తృతమైన పరిజ్ఞానం కావాలి. దానికి 'విద్య'ను చాలా గొప్ప అవకాశంగా గుర్తించాడు. దానినే తన విశిష్టమైన ఆయుధంగా మలుచుకున్నాడు. చరిత్ర, అర్థశాస్త్రం, మానవ వికాస శాస్త్రం, పరిపాలనా శాస్త్రం, న్యాయశాస్త్రం, జర్నలిజం మొ॥న అంశాలను అధ్యయనం చేశాడు. పరిజ్ఞానం పెంచుకున్నాడు. తన కార్యసాధనకు అవసరమైన కొత్త భాషలను నేర్చుకున్నాడు - ఇండియాలో కులాలు, కులం పుట్టుక - విస్తృతి, దాని పని విధానం, అంటరాని వాళ్ళెవరు? శూద్రులెవరు? రూపాయి విలువ, రాష్ట్రాలలో ఆర్థిక వ్యవహారాలు, మైనారిటీ జాతుల హక్కులు మొ॥న అనేక విషయాలపై

విస్తృతంగా రచనలు చేసి తన భావాలను ప్రపంచానికి చాటాడు. పరిష్కారాలను ప్రతిపాదించాడు. నాటి 30 కోట్ల జనాబాలో ఓటుకు దూరంగా ఉన్న 29 కోట్ల ప్రజల కోసం ప్రతిపాదనలు చేశాడు. ఎగుడు దిగుడు విలువల హిందూ బ్రాహ్మణీయ, కులం, అమానుష వ్యవస్థ కింద నలిగిపోతున్న శూద్ర, అతిశూద్రుల విముక్తి కోసం డా॥ అంబేడ్కర్ ప్రతిపాదించిన సూత్రమే కుల–వర్ణ నిర్మూలన.

ఆయన అప్పటికే ప్రచారంలో గల వివిధ మార్గాలను కూడా పరిశీలించాడు. గాంధీ 'హరిజనోద్ధరణ' మోసపూరిత ప్రచారమని, కులవ్యవస్థ మంచిదే – అస్పృశ్యత ఆపేక్షణీయం అన్న గాంధీని నమ్మజాలమని తేల్చుకున్నాడు. ఆర్థిక అంశాలే మిగతా రంగాలను శాసిస్తాయనీ వర్గపోరాటంలోనే అంతరానితనం వంటి అన్ని సమస్యలు పరిష్కారమైపోతాయనే కమ్యూనిస్టుల వైఖరి హిందూ అగ్రకుల వైఖరికి ఏమాత్రం దూరం కాదనీ, వారు చెప్పే కార్మికులంతా ఒకే వర్గం అనే వాదనలోని డొల్లతనాన్ని బొంబాయి జౌళి కార్మికుల సమయంలో స్వానుభవంతో తెలుసుకున్నాడు. చివరకు సామాజిక రంగంలో కుల–వర్ణ నిర్మూలన, రాజకీయ రంగంలో రాజ్యాధికార సాధనలను తన విధానంగా ప్రకటించాడు. వర్ణ నిర్మూలన సాధ్యం కాకపోతే ఆ మతాన్నే వదలివెయ్యాలని కూడా భావించాడు. ఆ భావాల వివరణే బాబాసాహెబ్ రచన – 'అన్హిలేషన్ ఆఫ్ కాస్ట్' (An Annihilation of Caste), అనే కులవర్ణ నిర్మూలన సిద్ధాంతం (1936).

మహద్ చెఱువు, కాలారం దేవాలయం పోరాటాల అనంతరం హిందువులతో అంటరాని జాతుల బేరసారాలు ఏ విధంగా ఉంటాయో గ్రహించాడు. హిందువులతో బాబా సాహెబ్ అంబేడ్కర్ ఆఖరి సంభాషణ ఈ కుల నిర్మూలన ప్రసంగం.

ఇది లాహోర్‌లోని కుల నిర్మూలన పోరాట మండలి (జాత్‌పాత్ తోడక్ మండల్) వారి ఆహ్వానం మేరకు 'కుల నిర్మూలన' అనే అంశంపై 1936వ సం॥ నాటి వార్షిక సభలో అధ్యక్షోపన్యాసం కొరకు తయారు చేసుకున్న ప్రసంగ పాఠం. ఆ సంస్థ త్రివర్ణ హిందువుల నాయకత్వంలో నడిచే సంస్థ. గాంధీ శిష్యుడు భాయీ పరమానంద దాని స్థాపకుడు (1922).

సంఘ సంస్కరణాభిలాషతో, త్రివర్ణాల నాయకత్వంలో ఏర్పడిన కుల నిర్మూలనన పోరాట మండలి తమ లక్ష్యం సిద్ధించాలంటే ఏమి చెయ్యాలో వివరంగా

ప్రస్తావించాడు బాబా సాహెబ్. వారిని కొన్ని ప్రశ్నలు వేశాడు. ఎన్నో వివరణలు ఇచ్చాడు. క్లుప్తంగా ఆ విషయాలు:

"గాంధీ భక్తులు గాను, కాంగ్రెస్ వాదులుగాను ఉన్న కుల నిర్మూలన మండలి వారు జరుగుతున్న విషయాలను గమనించాలి. కాంగ్రెస్‌కు సమాంతరంగా సంఘ సంస్కరణ లక్ష్యంగా ఏర్పడిన 'సోషల్ రిఫాం' పార్టీని కాంగ్రెస్ నిర్వీర్యం చేసింది. వాళ్ళు సభ నిర్వహిస్తే ఆ వేదికను తగులబెడతానని బాలగంగాధర తిలక్ బెదిరించాడు. విస్తృత సామాజిక వర్గాలకు తగు నిష్పత్తిలో రాజకీయ అధికారాలను ప్రసాదించిన 'కమ్యూనల్ అవార్డు'ను కాంగ్రెస్ ఏ గతి పట్టించిందో గ్రహించి కాంగ్రెస్‌పై ఆశలు పెట్టుకోవడం అనవసరం.

బ్రాహ్మణీయ సంస్కృతి ప్రజలను ఎక్కువ తక్కువలుగా విడగొట్టి వారి మధ్య అసమ సంబంధాలను సృష్టించిన భారత సమాజంలో 'కార్మికులంతా ఒకే వర్గం' అనే కమ్యూనిస్టుల నినాదం ఉత్త వాగాడంబరమే. కుల-వర్ణ వివక్షలేని సమ న్యాయం దొరుకుతుందనే నమ్మకం కలగనంత కాలం కార్మికులంతా ఒక్కటిగా నడవడం కల్ల. నిరంతరం వివక్షకు గురౌతూ పేదరికంలో మగ్గుతున్న నిరుపేదలు ధనికులపై తిరుగుబాటుకు సన్నద్ధం కారు.

భారతీయ గిరిజనులను నేరస్థ జాతులుగా ముద్రవేసిందీ కులవర్ణ వ్యవస్థ. నాగరికతకు తలుపులు మూసివేసి వారిని పరాయీకరించి శత్రుశిబిరాలుగా మార్చివేస్తున్నది.

**"కుల-వర్ణ నిర్మూలన త్రివర్ణాలతో సాధ్యం కాదు. కారణం బ్రాహ్మణులు. వర్ణనిర్మూలన పట్ల వారి వ్యతిరేకవైఖరి. సమాజంలో రాజకీయ ఆర్థిక సంస్కరణోద్యమాలకు వారే మార్గదర్శకులు. వారికే ప్రగతిశీలురుగా పేరు. వారు కుల-వర్ణాల ప్రస్తావన రానివ్వరు. వారు ముందుండి ఉద్యమాన్ని నడిపించరు. వర్ణ నిర్మూలన జరిగితే మొదట నష్టపోయేది బ్రాహ్మణ వర్ణం, వారి ఆధిక్యత.**

ఏ సమాజంలోనైనా సంస్కరణోద్యమాలకు ముందుండేది **మేధోవర్గం. ఇక్కడ మేధోవర్గానికి మరోపేరు బ్రాహ్మణులు. వాళ్ళు దేశ ప్రయోజనాలకంటే తమ వర్ణం ప్రయోజనాలే ముఖ్యం అన్నట్టు ఉంటారు. వాళ్ళే హిందువులకు పూజనీయులు. 'వర్ణానాం బ్రాహ్మణోగురు' అని కదా శాస్త్రం. మనువు ప్రకారం 'బ్రాహ్మణుడే**

ధర్మశాస్త్రం'. కాబట్టి సమాజాన్ని తన గుప్పెట్లో పెట్టుకున్న మేధోవర్గం అడ్డుగా వున్నంతకాలం సంస్కరణ సాధ్యం కాదు.

కులవర్ణ నిర్మూలనకు హిందువులను ఉమ్మడిగానూ కదిలించలేరు. సమాజం కులాలుగా వర్ణాలుగా ఒకరి నెత్తిమీద ఒకరు ఉంటారు. ఎవరికి వారు తమ కిందివారికంటే అధికులమని నమ్ముతారు. ఈ వ్యవస్థలో వర్ణాలు తప్ప కులాలన్నీ కట్టు బానిసలే. కొన్ని ఎక్కువ బానిసలు, కొన్ని తక్కువ బానిసలు. మరి ఈ పరిస్థితులలో – పోరాడితే పోయేదేమీలేదు, బానిస సంకెళ్ళు తప్ప – అంటే ఎవరు పోరాడతారు? ఎవరి సంకెళ్ళు పోతాయి? పైగా వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా కార్యక్రమాలు జరిగితే బ్రాహ్మణులు వెంటనే వ్యవస్థను స్తంభింపజేస్తారు.

కులవర్ణ వ్యవస్థ అహేతుక వ్యవస్థ. దీన్ని నిర్మూలించడం అని త్రివర్ణ హిందువులను ఒప్పించలేరు. ఎందుకంటే హేతుబద్ధంగా నడుచుకునే స్వేచ్ఛ హిందువులకు లేదు. మనుస్మృతి ప్రకారం ప్రతి హిందువు – వేదం, స్మృతి, సదాచారం ప్రకారమే నడుచుకోవాలి. స్వబుద్ధికి తావులేదు. సాంప్రదాయం పాటించు. పాటించకపోతే ప్రాయశ్చిత్తం చేసుకో అంటుంది. కాబట్టి ఆ విశ్వాసాలకు తిరుగులేదు.

ఆ విధంగా హేతవు, నైతికతలకు అతీతంగా దుర్భేద్యంగా నిలబడి ఉంది వర్గం. దాన్ని కాపాడుతున్నది మేధోసైన్యం. అది బ్రాహ్మణుల సైన్యం – వారు హిందువులకు జన్మతః నాయకులు. అది కిరాయి సైన్యం కాదు. ఆత్మాహుతి సైన్యం. కాబట్టి దాన్ని దెబ్బకొట్టాలంటే ఒకటే మార్గం. అది

–హేతువును, నైతికతను, హత్యచేసిన వేదాలనూ, శాస్త్రాలనూ పేల్చి వేయడం.

–స్మృతి, శృతులకు చెందిన హిందూ మతాన్ని నిర్మూలించడం. అదే వర్ణ నిర్మూలనకు మార్గం. అదే నా దృక్పథం.

అంటే–

వర్ణ వ్యవస్థ సత్యం అనీ, అంతిమ సత్యం అనీ, శాశ్వత సత్యం అనే భాష్యం చెప్పడం అభ్యంతరకరం. త్రివర్ణాల ధర్మ శాసనానికి మతం అనే ముసుగువేసారు. దాన్ని తొలగించడం మీరు చేయవలసిన మొదటిపని. అప్పుడే మీ సంస్కరణాభిలాష గురించి చెప్పుకో గలుగుతారు.

**కుల నిర్మూలన మండలి ద్వారా మీరు చేపట్టిన ఉద్యమం జాతీయ ఉద్యమం. కుల-వర్ణ విశ్వాసాలతో కలుషితమైన సిక్కు-ముస్లిం-క్రైస్తవ మతాలలోని పీడితుల నుండి కూడా మీకు మద్దతు ఉండాలి.**

**స్వరాజ్య ఉద్యమానికి జాతి మద్దతు ఉంది. కానీ కుల నిర్మూలన పోరాటం జాతి భావజాలానికి వ్యతిరేకంగా చేసే ఒంటరి పోరాటం. స్వరాజ్య ఉద్యమం సవర్ణుల పోరాటం. కుల నిర్మూలన పోరాటం మన అవసరం. హిందూ సమాజం వర్ణ వ్యవస్థ నుండి విముక్తి అయితేనే తనను తాను నిలబెట్టుకుంటుంది. అలాంటి చేవ లేనప్పుడు స్వరాజ్యం సరికొత్త బానిసత్వంలోకి నెట్టివేస్తుంది."**

ఇదీ బాబాసాహెబ్ కుల నిర్మూలన మండలి వారి సభలో ఇవ్వదలచిన ఉపన్యాసం. అయితే ఆ సభ జరగలేదు. ఉపన్యాసం ఇవ్వలేదు. తన ఉపన్యాసంలో వేదాలు, శాస్త్రాలను పేల్చివేస్తేనే కుల వర్ణ నిర్మూలన సాధ్యం అన్న మాటలతో బెదిరిపోయి సభనే రద్దు చేసుకున్నారు. మాటలకే బెదిరిపోయేవాళ్ళు కులనిర్మూలన ఏం చేయగలరని ప్రశ్నించిన బాబాసాహెబ్ తన ఉపన్యాసాన్ని తానే ముద్రించాడు. అదీ చరిత్ర.

***

"హిందూ సమాజం ఒక కులాల సమ్మేళనం. ప్రతి కులమూ అదొక పరిమిత సంస్థ. కాగా అందులోకి కొత్తవారికి ప్రవేశం లేదు. ఇతర మతాల వాళ్ళను, జాతులను, తమ మతంలో కలుపుకొని తద్వారా తమ మతాన్ని, తమ సమాజాన్ని విస్తరింపజేసుకునే అవకాశం హిందువులకు లేకుండా పోవడానికి కారణం కేవలం కులవ్యవస్థే. హిందూమతంలో కులాలు నిలిచి ఉన్నంత కాలం హిందూమతం ప్రచారక మతం ఎన్నటికీ కాజాలదు."

# ౩. కులం - మతం - అంబేద్కర్ - కొన్ని ఆలోచనలు

**-ఎ.ఎన్. నాగేశ్వరరావు,** అంబేద్కరిస్ట్, బెంగుళూరు.

1932లో పూనా ఒప్పందం సంతకాలు చేస్తూ, దీనికి దారి తీసిన పరిస్థితులను బేరీజు వేసుకుంటున్నాడు డాక్టర్ అంబేద్కర్. దాని తర్వాత తన మనఃస్థితిని బట్టి ప్రతిస్పందిస్తాడు. దళితులు హిందూ పండగ నీడల్లో ఎన్నాళ్ళు వుంటారో, అంతవరకు వారి బానిసత్వపు సంకెళ్లు కొంచెం కూడా కదలవు. వాళ్లు ఏ మాత్రం సంకెళ్లు తెంచుకోడానికి ఒప్పుకోరు, ఎందుకంటే సంకెళ్ళు వేసిందే వాళ్లు కాబట్టి. అందుకే ఆయన తన ప్రజానీకాన్ని హిందూమతం నుండి బయటకు వచ్చి, మీకు సమానత్వపు హెూదా, ఆదర్శం యిచ్చే ఏ మతంలోనైనా చేరండి అని పిలుపు నిస్తాడు. ఆయన ప్రఖ్యాత ప్రకటన, 'నేను హిందువుగా జన్మించాను, ఎందుకంటే నాకు దీనిపై నియంత్రణ లేదు. కానీ నేను హిందువుగా మాత్రం చనిపోను'. ఆయన ఉద్దేశ్యంలో హిందూమతం నుంచి బయటపడితే అసమానత్వం నుండి బానిస సంకెళ్ల నుండి దళితులు బయట పడినట్లు. హిందూమతం అంటే కుల వ్యవస్థ. హిందూమతం లేకపోతే కులవ్యవస్థ లేదు. హిందూమత నిర్మూలన కుల / వర్ణ నిర్మూలన. లేదా కులవ్యవస్థకు మారుపేరయిన హిందూమతం నుండి బయట పడటం ఏకైక మార్గం.

తర్వాత దేశకాల పరిస్థితుల్లో ఎన్నో మార్పులు కొనసాగాయి. భారత రాజ్యాంగం డెబ్బయి ఏళ్ల అమలు తర్వాత 'అగ్రకులాలు', 'నిమ్న కులాలు' మొత్తం కులవ్యవస్థ గతం కంటే మరింత 'రాజకీయం' సంతరించుకుంది. ప్రభుత్వాలు మారాయి కానీ కులవ్యవస్థ మాత్రం కొనసాగుతూనే వుంది. డాక్టర్ అంబేద్కర్ 1937లో 'వర్ణ నిర్మూలన' (Annihilation of Caste) రాస్తూ ఒక మాటంటాడు. "యీ ప్రపంచం రుణపడి వుండేది – రెబల్స్‌కే. దైవాంశ సంభూతులమని చలాయించే వారిని సైతం ఢీకొని వాళ్లు మానవాతీతులేమీ కారని, వాళ్ల వర్ణ ప్రయోజనాలకి వాళ్లు బానిసలేనని వాళ్ల మొహం మీదే ఎలుగెత్తి చాటే రెబల్స్‌కే యీ ప్రపంచం రుణపడి వుండేది... హిందూ త్రివర్ణాలు విషగ్రస్తులనీ వాళ్ల విషం భారతదేశం లోని అణగారిన అంటరాని కులాలకు ప్రాణాంతకమైనదనీ నేను చెప్పగలిగితే నాకు అంతే చాలు."

కులాన్నీ దాని నిర్మూలన గురించి డాక్టర్ అంబేడ్కర్ అవగాహన విస్తృతమైనది. ఎన్నోసార్లు ప్రస్తావించబడింది.. ఆయన విస్తృతంగా రాసిన ఎన్నో రచనల్లో వివిధ రకాలుగా కులసమస్య – దేశ సమస్యగా విపులీకరించబడింది. ఒక మామూలు మేధావికీ, ప్రపంచాన్ని అవలోకించే తత్త్వవేత్తకు తేడా యిక్కడే తెలుస్తుంది. హిందూ అగ్రకుల మేధావులు విస్మరించిన డాక్టర్ అంబేడ్కర్ దార్శనికతను, తాత్విక దర్శనాన్నీ ప్రపంచం గుర్తిస్తూంది, గుర్తించనందుకు ఫలితాలను అనుభవిస్తూంది.

ఇంతకుముందుగా ప్రస్తావించినట్లు కులం ప్రాథమికంగా మతపరమైంది. అందుకే, కుల / వర్ణ నిర్మూలనకు ఒక మార్గం మత విధ్వంసం లేదా మత నిర్మూలన. డాక్టర్ అంబేడ్కర్ హిందూ మత మూలాలను ఎన్నో రచనలలో విస్తృతంగా వివరిస్తాడు. వాటి బ్రాహ్మణీయ స్వార్థపరత్వాన్ని నిరూపిస్తాడు. అందుకే స్వయంగా తాను భావవాద మతమైన హిందూమతం నుంచి భౌతికవాద మార్గమైన బౌద్ధాన్ని ఆశ్రయిస్తాడు. ఇది తన ప్రజలకు ఆయన యిచ్చిన ప్రత్యామ్నాయ సందేశం. అయితే, దీనితోనే కుల / వర్ణ నిర్మూలన సిద్ధిస్తుందా? కానీ ఒక ప్రత్యామ్నాయ సాంస్కృతిక పోరాటం అన్నది మొదలైందా లేదా అన్నది ఆలోచించాలి.

డా॥ అంబేడ్కర్ అప్పట్లో అమెరికా, లండన్ యూనివర్శిటీల్లో చదవడం మూలాన, స్వదేశంలో తనకున్న అనుభవం వల్లా, విస్తృతమైన అధ్యయనం తోడవడం – వీటన్నింటికన్నా తన జాతిని ఉద్ధరించాలనే తీవ్రమైన తపన తనను అత్యంత ఆధునికుడిగా మార్చింది. దేశ విదేశాల రాజ్యాంగాలను అధ్యయనం చేయడం, వాటి చరిత్రలను కూడా అధ్యయనం చేసి నాటి బ్రిటిషు ప్రభుత్వంతో అధికారికంగా అన్ని విషయాల మీదా చర్చించే అవకాశాన్ని ఆయన అంది పుచ్చుకున్నాడు. తర్వాత కాలంలో తన ఆలోచనలన్నీ రచనల రూపంలో తన వారసులకు తాత్విక భూమికగా అందించాడు. ఆయన ప్రసంగాలు ఎంత సులభంగా వుంటాయో, ఆయన రచనలు మాత్రం ఒక దార్శనికుడు, తాత్వికుడు, మేధావి, రాజకీయ వేత్త, పరిశోధకుడు, శాస్త్రవేత్త – అందరూ ఒకటిగా రాసినట్లు అధికారికంగా వుంటాయి. ఎందుకంటే, ఆయన శ్రోతలు ఎక్కువ భాగం అంతగా విద్యలేని దళిత, వెనుకబడిన కులాలు కాబట్టి ఆయన ప్రసంగాలు వారికి అర్థమయ్యే విధంగా మలచుకున్నాడు. అదే రచనల వరకు వస్తే, తనను చదివేవాళ్లు దళితులు, వెనుకబడిన కులాలు, మైనారిటీలే

కాకుండా స్వదేశ, విదేశాల్లో కూడా వున్నారు. కాబట్టి ఆయన రచనలు మేధోపరంగా వుంటాయి.

మత నియమాలలోని పవిత్రత, అపవిత్రతలే కుల వ్యవస్థ సారాంశంగా డా॥ అంబేద్కర్‌తో బాటు వెబెర్ కూడా భావిస్తాడు. భారతీయ రైల్వేలలోని అందరూ వాడే స్నానాల గదులు / మరుగుదొడ్లను హిందూ – 'పవిత్రులు', అంతరాని – 'అపవిత్రులు' అన్ని కులాల వాళ్ళూ భౌతికంగా వాడుతుంటారు. కానీ కులం నిర్మూలింపబడలేదు, అస్పృశ్యతా పోలేదు, అలాగని కుల వివక్షా నశించలేదు. వాటిని వాడడంలో ఏ వివక్షా లేదు మరి!

డా॥ అంబేద్కర్ అంటాడు, రైల్వే ప్రయాణాల్లో, విదేశీ యానాల్లో మిగతా చాలాచోట్ల వేలాదిమంది హిందువులు కులాన్ని బద్దలు చేసే విధంగా ప్రవర్తిస్తుంటారు. హైందవేతరులకు యిది ఆశ్చర్యంగా అనిపిస్తుంది. చాలాచోట్ల కులాన్ని పట్టించుకోని వీళ్లు, మిగతా జీవితంలో కులం లేకుండా జీవించలేని పరిస్థితిలో ఎందుకున్నారు అని. అందుకే కులం ఒక విచిత్రమైన హిందూమతంగా అనిపిస్తుంది. అంతే కాకుండా, 'అపవిత్రమైన కార్యక్రమాలు' చేసినపుడు వాటిని పరిశుద్ధం చేసేందుకు ప్రత్యామ్నాయ పూజా కార్యక్రమాలు హిందూమతంలో ఎన్నో వున్నాయి. కుల సోపాన క్రమం యొక్క భౌతిక పునాది వున్నంతవరకు యిపుడున్న ఉత్పత్తి, ఆస్తి సంబంధాల ద్వారా అది పరిరక్షింపబడుతూ వుంది.

కుల వ్యవస్థ యొక్క మత పరమైన లక్షణాన్ని సూచిస్తూ, డా॥ అంబేద్కర్ కులం హిందూమతానికి విచిత్రమైందని వాదిస్తారు. ఆయన యిలా రాస్తారు:

"హిందువుల్లాగే హైందవేతరుల్లోనూ కులాలు వుండినా, కులానికి హిందువుల్లో వుండినంత సామాజిక గుర్తింపు హైందవేతరుల్లో వుండదు. మహమ్మదీయుని కానీ సిక్కుని కానీ మీరెవరని అడగండి? అతను తాను మహ్మదీయుడో లేదా సిక్కు మతస్తుడో చెబుతారు. అతను తన కులం గురించి ఏ మాత్రమూ చెప్పడు, తన జవాబుతో మనం మళ్లీ ఏమని అడగం. తను ముస్లిం అని చెప్పినప్పుడు, మనం అతన్ని షియా లేదా సున్నీ నా షేక్ లేదా సయ్యద్‌వా; ఖాతిక్ లేదా పింజారీవా అని తిరిగి అడగం. అతను తాను సిక్కు అని చెప్పినప్పుడు, మీరు తిరిగి వారిని జాట్ లేదా రోడా; మజ్‌బీ లేదా రామ్‌దాస్ అని అడగరు. కానీ, అదే హిందువు విషయంలో

అలా చెబితే మీరేమాత్రం సంతృప్తిపడరు. అతన్ని మీరే కులం అని తెలుసుకొనేంత వరకు వదలరు. ఎందువల్ల? ఎందువల్లంటే, హిందువుకు కులం గురించి తెలుసుకుంటే తప్ప వారెలాంటివారో, ఎలాంటి మనిషో అని సరిగ్గా అంచనా వెయ్యలేరేమో! ఇక్కడ యింకొకటుంది, హైందవేతరుల్లో కులానికి అంతగా సామాజిక గుర్తింపు వుండదు. అదే హిందూ కులాల్లో ఎంతో ప్రాధాన్యముంటుంది. బహుశా సిక్కులలో, మహ్మదీయుల్లో కులం వుండవచ్చేమో కానీ, వారిలో కులాన్ని అతిక్రమిస్తే, కుల బహిష్కరణలనేవి ఏ మాత్రం వుండవు. వాస్తవానికి, బహిష్కరణ అనే ఆలోచన సిక్కులు లేదా మహమ్మదీయులకు లేదు. అది వారికి విదేశీయమైనదే. అదే హిందువుల విషయంలో పూర్తి భిన్నమైన పరిస్థితి. కుల అతిక్రమణలు కనుక హిందువులు చేస్తే వారు కులబహిష్కరణకు గురవుతారు. ఇదొక్కటే చాలు, హిందువుల్లోనూ – హైందవేతరుల్లోనూ సామాజిక గుర్తింపు యొక్క తేడా. ఇది వారి మధ్య విభేదాలలో రెండో అంశం. కానీ, చాలా ప్రాధాన్యత కలిగిన మూడో పాయింటు కూడా వుంది. హిందువులు కాని వారిలో కులానికి మతపరమైన 'పవిత్రత' లేదు, అదే హిందువులలో మతపరమైన 'పవిత్రత' ఎక్కువ వుంటుంది. హైందవేతరుల్లో కులం కేవలం ఒక సాధన మాత్రమే, పవిత్రమైన సంస్థ ఏమాత్రమూ కాదు.'

ఆదర్శవాద దృక్పథంలో, కులం అనేది మతం యొక్క సృష్టి. వాస్తవానికి ఉత్పత్తి మరియు ఆస్తి సంబంధాలతో పాతుకుపోయి, బలవంతంగా అమలు చేయబడితే, కులం అపవిత్రమే అవుతుంది. హిందూమతం లేకుండా కులం లేదు. అలాగే కులం లేకుండా హిందూమతమూ లేదు యివి రెండూ చెట్టూ ఆకుల్లాంటివి. ఆదర్శవాదం అనేది కేంద్రకంగా కులం ముసుగు వేసుకొంటుంది; రాజకీయ ఆర్థికశాస్త్రాన్ని బట్టి కులానికి పవిత్రత అద్దనక్కరలేదు, దానివల్ల ప్రయోజనం లేదు.

కులాంతర భోజనాలూ, కులాంతర వివాహాలూ సాధారణ జీవితంలో కొనసాగితే కులసమస్య వీలువెంబడి తగ్గే అవకాశముందని డా॥ అంబేద్కర్ చాలా చోట్ల రాస్తాడు. హిందువుల్లో అత్యధిక భాగం కులాంతర భోజనాలు కానీ కులాంతర వివాహాలు కానీ చేయరు. ధర్మశాస్త్రాలు, పురాణాల, 'పవిత్ర' గ్రంథాల ప్రకారం– యివన్నీ 'పాప'కార్యాలే. ఇవన్నీ మత సంబంధం లేకుండా చేయకూడని పనులు. 'కులం' అనేది ఒక భావన, అదొక మానసిక స్థితి. భౌతికంగా దాన్ని నాశనం

చేయలేము, ఎందుకంటే అది మానసికం కాబట్టి! దీనర్థం భావపరంగా మార్పు రావాలి', అంటాడు డా॥ అంబేద్కర్. మానసికంగా మార్పు రావడానికి కృషి చేస్తున్న హేతువాదం, నాస్తికవాదం, మానవవాదం, సోషలిజం, కమ్యూనిజం ఈ దేశంలో సరిపడనంతగా పనిచేయడం లేదా? లేదా పారిశ్రామిక వాదం అందిపుచ్చుకున్న ఆధునిక వాదాలు ఇండియాలో వ్యాపించలేదా? లేదా ఈ సిద్ధాంతాలను వల్లిస్తోన్న అగ్రకుల హిందువులు కుల / వర్ణ నిర్మూలన జరగాలని చిత్తశుద్ధితో అనుకోవడం లేదా? ఆధునిక వాదాలు హిందూమత పాతంతో కలగలిసిపోయాయా? ఒక విచిత్ర పరిస్థితి ఇండియాలో వ్యాపించి వుంది. భారత రాజ్యాంగం ద్వారా కులమత వివక్షలు నిషిద్ధం, నేరం. కానీ వాస్తవానికి యిదే అభివృద్ధికి మెజారిటీ ప్రజలను దూరం పెడుతున్నాయి.

దీనికి విరుద్ధంగా వాస్తవ ప్రపంచంలో కులం అనేది మానసికంగా కంటే ఎక్కువగా వుంది. మానసిక కంటే ఎక్కువగా, సర్వత్రా వ్యాపించిన కుల వినాశనం చేయాలంటే దిక్కుతోచని విధంగా వుంది. ఇంకోరకంగా చూస్తే, కులం మానసికం కాకుండా, భౌతికంగా వుంది. భౌతిక పరిస్థితులు మారకుండా మానసిక స్థితిగతులు మారవు కదా! కులం పుట్టుక, వ్యాప్తి, విశృంఖలత్వం కొన్ని వేల ఏళ్లుగా రకరకాలుగా మార్పులు చెంది చివరకు నిర్మూలించడానికి సాధ్యంకాని స్థితికి కులం చేరుకుందా? భౌతిక పరిస్థితులు మార్పు చెందాలంటే, మరీ ముఖ్యంగా పెత్తందారీ కులాలు ఉత్పత్తి శక్తులను అదుపులో పెట్టుకొని వేలాదిఏళ్లుగా అధికారాలు చెలాయిస్తూ, నిమ్న కులాలను తమ భావజాలానికి అనుగుణంగా మతంతో ముడివేసుకున్న కుల వ్యవస్థతో అట్టి పెట్టారు. పెత్తందారీ కులాలతో బాటు నిమ్న కులాలు కూడా యిక్కడ కులం – మతం స్థితిగతులను ఎదుర్కోగలగాలి. అలాగే, ఉత్పత్తి శక్తులు, సంపద ఎవరి చేతుల్లో వుంటే అధికారం అక్కడ వుంది. కాబట్టి వాటిని కూడా అదుపు చేయగలిగితేనే కులం అదుపు చేయగలిగే అవకాశం వుంటుందా? అయితే, డెబ్బయి ఏళ్ల స్వాతంత్ర్యం, రాజ్యాంగ హక్కులు అమలు జరిగిన తీరును మళ్లీ తిరగతోడాలా? ఇవన్నీ చర్చనీయాంశాలే కదా! డా॥ అంబేద్కర్ కృషి వల్ల రాజ్యాంగం, హక్కులు, చట్టాలు అమలు జరిగిన తీరును సమీక్షించుకోవద్దా? ఇవన్నీ బీరకాయ పీచులాగా ఒకదానికొకటి కలగలసిపోయిన సమస్యలుగా అగుపించినా, సమస్య మాత్రం ఎదుట అడ్డుగోడగా నిలబడే వుంది. దాన్ని కూల్చాలి.

చివరగా, యిదే విషయాన్ని పునస్సమీక్షిద్దాం. డా॥ అంబేద్కర్ సుదీర్ఘంగా కొనసాగించిన పోరాటం, ఉద్యమాలు కొన్ని ఫలితాలనిచ్చాయి. ఆ పోరాటాలను అందిపుచ్చుకునే ఆయన వారసత్వం, వెనుకబాటు పడడం వల్ల తిరిగి సమస్య మొదటికొచ్చింది అనేది తేటతెల్లమౌతుంది. ఒకటేమిటంటే, వేల ఏళ్లుగా ఉనికిలో చెలామణీలో వుండినందువల్ల, కులం దేశ సామాజిక రాజకీయ ఆర్థిక జీవితాల్లో సాధారణీకరింపబడి పోయింది. కులం సాధారణ జీవితంలో ఒకటిగా అలవాటు చేయబడింది. సిద్ధాంతాన్ని మరియు ఆచరణలో, కులాన్ని సాధారణ విషయంలాగా ప్రశ్నించడం జరగడం లేదు. సమాజాన్ని వ్యక్తిని ఈ విషయంగా లోతుగా అధ్యయనం చేయడం అవసరం, అదీ కుల నిర్మూలనకు వేయాల్సిన తొలి అడుగు. ఆ అడుగులు డా॥ అంబేద్కర్ అత్యంత బాధ్యతతో నెరవేర్చాడు. కులాన్ని దాని పునాదిగా వున్న మతాన్నీ, శాస్త్రాలనూ ప్రశ్నించాడు. రోజువారీ జీవితంలో కులం ఎలాంటి విధ్వంసకర పాత్ర పోషిస్తున్నదీ, తన రచనలలో ప్రసంగాలలో విస్తృతంగా వివరించాడు.

1928లో మహద్ సమావేశంలో డా॥ అంబేద్కర్ యిలా అంటాడు:

'మన తలపై ఎత్తుకున్న అంతరానితనం నిర్మూలించే బాధ్యత, సమానత్వాన్ని నెలకొల్పే బాద్యత మనద్వారానే పరిష్కరింపబడాలి. ఇతరులు చేయాలంటే యిది సాధ్యంకాని పని... మన పురోగతి మార్గం నుండి వచ్చే అడ్డంకులను తొలగించే బాధ్యత కూడా మనమే తలకెత్తుకోవాలి.'

1928లో డా॥ అంబేద్కర్ ఈ ప్రకటన చేసినపుడు, దళితులు అంటరానితనం నిర్మూలన కోసం లేదా కుల నిర్మూలన కోసం పోరాటాన్ని కొనసాగించాల్సి వుండింది. కులాల మధ్య సామరస్యాన్ని, సమానత్వ భావజాలాన్ని ఏర్పాటు చేయడం కోసం దళితులు ఉద్యమాలు ఉధృతం చేసి వుండాల్సింది. ఇంకో విషయం ఏమంటే, యిపుడు కుల సమస్య కేవలం దళితులు మీదే వుండే భారం / సమస్య కాదు. ఈ బాధ్యత బాధిత ప్రజలందరిదీ. డెబ్బయి ఏళ్ళ రాజ్యాంగపు ఫలితాల అమలు వల్ల ఒనగూడిన మార్పులతో దేశంలో విచిత్ర స్థితిగతులు నెలకొన్నాయి. ఈ స్థితిగతులను అధ్యయనం చేస్తూ, వెనుకబడిన కులాలను, మైనారిటీలను, మహిళలను, కుల నిర్మూలనకోసం చిత్తశుద్ధితో పాటుపడే అన్ని శక్తులను కలుపుకొని కుల సమానత్వం కోసం ఉద్యమించాల్సి వుంది. కుల సమానత్వం ఎపుడయితే

సాధించగలుగుతారో మానసికంగా, భౌతికంగా కొనసాగుతోన్న కుల అసమానత్వాలు దెబ్బతినే అవకాశముంది. తర్వాత కాలంలో కుల నిర్మూలన భావజాలం విస్తృతం అనివార్య మవుతుంది. అమెరికాలో జాతి వివక్ష పోరాటంలో శ్వేతజాతీయులు కూడా భుజం కలిపి పోరాడినట్లే, ఇండియాలో కూడా కుల నిర్మూలనా పోరాటంలో అన్ని కులాలనూ సమాయత్తం చేయగలగాలి, ఆయన రచనలను, భావజాలాన్ని ఉద్యమ రూపంలోకి తీసుకురాగలగాలి. అంబేడ్కర్ వాదాన్ని అధ్యయనం చేయకుండా దళిత నాయకత్వం పరిపక్వం కాదు. కుల నిర్మూలన అనేది ఏకవ్యక్తి పోరాటమా? కాదు. ముందుగా ఎవరయితే బాధితులో దళితులు, వెనుకబడిన కులాలు, మైనారిటీలు, మహిళలు వీరంతా అంబేడ్కర్ వాదంతో సాయుధులు కావాలి.

(హీరాసింగ్ సైద్ధాంతిక వ్యాసం 'Three Moments in Annihilation of Caste' కి కృతజ్ఞతలతో)

***

"... మనం ఎదుర్కోవలసిన శత్రువు కులవ్యవస్థను అనుసరిస్తున్న ప్రజలు కాదు. అట్టి కులవ్యవస్థతో కూడిన మతాన్ని వాళ్లకు ప్రబోధిస్తున్న శాస్త్రాలు. అందువల్ల, వర్ణాంతర భోజనాలకు, వర్ణాంతర వివాహాలకు వ్యతిరేకులయిన వారిని విమర్శించడం వల్లగాని, హేళన చేయడం వల్ల గాని లేక అప్పుడప్పుడు వర్ణాంతర భోజనాలు, అక్కడక్కడ వర్ణాంతర వివాహాలు జరపడం వల్ల గాని ఏమి ప్రయోజనం ఉండదు. మనం అనుసరించవలసిన సరైన మార్గం ఏమిటంటే – శాస్త్రాల పట్ల, వాటి పవిత్రత పట్ల ప్రజలకు గల విశ్వాసాన్ని తొలగించడం."

# 4. బాబాసాహెబ్ కల.. కుల నిర్మూలన!

**– నేతల ప్రతాప్‌కుమార్,** అధ్యక్షులు, అంబేడ్కర్ సాహిత్య అకాడమి, తణుకు

'కుల నిర్మూలన' 1986లో వచ్చిన డా॥ బి.ఆర్. అంబేడ్కర్ రచన. కుల నిర్మూలన దిశగా సంస్కరణలు చేపట్టాలనే ఆశయం గల 'జాత్ పాత్ తోడో మండలి' వారి సమావేశంలో అధ్యక్షోపన్యాసం ఇవ్వడానికి అంబేడ్కర్ తయారుచేసిన ఉపన్యాసం అది. మండలి వారికి వారి పరిమితులు వారికుండటం, తదనంతరం పరిణామాలలో ఆ సభ రద్దవ్వడం, ఆ ఉపన్యాసం పుస్తకంగా రావడం, గాంధీ ఆ పుస్తకంలోని వర్ణవ్యవస్థకు వ్యతిరేకంగా అంబేడ్కర్ చేసిన వ్యాఖ్యలను ఖండించడం, తిరిగి అంబేడ్కర్ గాంధీకి ధీటైన జవాబివ్వడం, ఇదంతా చరిత్ర.

అయితే ఆ గ్రంథంలో ఏముంది. జాత్ పాత్ తోడో మండలి లాంటి సాంఘిక సంస్కరణాభిలాషులు కూడా ఎందుకు వ్యతిరేకించారు, ఆ గ్రంధానికి నేటికీ ఉన్న ప్రాసంగికత ఏమిటి అనేది చర్చనీయాంశం. దాదాపు ఎనభై ఐదు సంవత్సరాల క్రితం రాయబడ్డ ఆ గ్రంథంలోని విలువైన సూచనలను సలహాలను భారతీయ సమాజం పెడచెవిన పట్టడమే నేటికీ కులవ్యవస్థ నిలిచిపోవడానికి కారణం. నిజానికి కుల ఉన్మాదం పాతుకుపోవడం కాకుండా శాఖోపశాఖలుగా విస్తరించి వటవృక్షంలా మారిపోయింది. మనం ఒక జాతిగా ఎప్పటికైనా మారగలమా అని బాబాసాహెబ్ ఆందోళన చెందినట్లుగానే ఇప్పటికే మనం భారత జాతిగా కాకుండా కులాలుగానే ఉండిపోయాం. ఈ దేశం ప్రపంచదేశాల ముందు తలవంచుకునే స్థితిలోనే మనం కులాభిమానం నుండి మతోన్మాద స్థాయికి చేరిపోయాం. ఈ కుల పిచ్చి ఆసుపత్రి నుండి భారతీయులను డిశ్చార్జి చేయాలంటే మరోసారి, మరోసారి బాబా సాహెబ్ డా. బి.ఆర్. అంబేడ్కర్ 'కుల నిర్మూలన' గ్రంధాన్ని దాని లోతులను పరిశీలించ వలసిందే.

'కుల నిర్మూలన' చిన్న ఉపన్యాస గ్రంథమే కాని, గొప్ప పరిశోధనా గ్రంథం. ఎన్నిసార్లు చదివినా మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే క్లాసిక్ కుల నిర్మూలన. ఈ గ్రంథంలో అనన్య సామాన్యమైన అంబేడ్కర్ ప్రతిభ, వాదనాపటిమ, తిరుగులేని విమర్శ పాఠకుడిని కట్టి పడేస్తుంది. చెప్పదలచుకున్న విషయాన్ని కేవలం చెప్పడమే

కాకుండా, తన వాదనకు మద్దతుగా చరిత్ర నుండి, సాహిత్యం నుండి అనేక ఉదాహరణలు చూపించి మనల్ని నిరుత్తకుల్ని చేస్తాడు. ముఖ్యమైన పాయింట్లు అండర్‌లైన్ చేసుకుంటూ పోతే మొత్తం పుస్తకాన్ని అండర్‌లైన్ చేయవలసి వస్తుందంటే అతిశయోక్తి కాదు. ఒక్క వాక్యంలో చెప్పాలంటే కులవ్యవస్థ మీద, కుల నిర్మూలనా పరిష్కారాల మీద ఇంతకంటే లోతైన పరిశోధన ఇంతవరకూ మరొకటి రాలేదనేది మాత్రం నగ్నసత్యం.

కులం పునాదుల మీద ఒక జాతిని, ఒక నీతిని నిర్మించలేమని బలమైన అభిప్రాయంగల అంబేడ్కర్ కులవ్యవస్థ శ్రమ విభజన కాదు. శ్రామికుల విభజన అంటాడు. కాబట్టి వర్గ దృక్పథంతో కుల సమస్యను చూసినపుడు అసలు సమస్య అలాగనే ఉండిపోతుందన్నాడు. అసలు సమస్య అలానే ఉండిపోవడం వలన కేవలం దళితులే నష్టపోతారని ఆయన భావించలేదు. మొత్తం హిందువులు నష్టపోతారని ఆయన వ్యాకులత చెందాడు. 'కుల వ్యవస్థ ఉన్నంత వరకు సంఘటిత శక్తి రాదు. సంఘటిత శక్తి లేనంతవరకు హిందువుడు బలహీనుడుగాను, పిరికివాడుగాను ఉండక తప్పదు'' అని అదే ముస్లింలలో సోదరభావం ఉంటుందని ఒక్క మహ్మదీయుడు ఒక పెద్ద హిందూ గుంపుకు సమానమని భావించడానికి ఇది కారణం అంటాడు. ఈ విశ్లేషణ చూసాక ఈ దేశంపై, అభిమానం ఉన్న వాళ్ళెవరైనాసరే కుల వ్యసవ్తను కూకటివేళితో కూలదోయాల్సిందే అంటాడు. అలా అననివాడు, ఈ సమాజం ఇలా ముక్కముక్కలై బలహీనంగానే ఉండాలని కోరుకునేవాడు దేశభక్తుడెలా అవుతాడు. అయితే కుల వ్యవస్థని కూకటి వేళ్ళతో కూల్చటమెలా? అదే కుల నిర్మూలన గ్రంథ సారాంశం. కేవలం సహపంక్తి భోజనాల వంటి కార్యక్రమాలతో సంతృప్తి చెందకుండా కుల నిర్మూలన దిశగా చేయవలసిన కొన్ని పనులు సూచించాడు. స్థూలంగా అవి

- కులాంతర వివాహాలు
- శాస్త్రాల అధికారాన్ని తిరస్కరించడం.
- హిందూమతానికి ఒక ప్రామాణిక గ్రంథాన్ని రూపొందించుకోవడం.
- వంశపారంపర్య మతాచార్యత్వం రద్దు చేయడం.

ఇలా కొన్ని విలువైన సూచనలు అంబేడ్కర్ చేస్తే మండలివారు అభ్యంతరం తెలిపారు.

ప్రధానంగా, అధికారాన్ని తిరస్కరించాలనే సూచనను మండలి వ్యతిరేకించింది. హిందూమతాన్ని ఉన్నతంగా తీర్చిదిద్దాలనే గొప్ప సూచనను వాళ్ళు హిందూ మత నిర్మూలనగా అపార్థం చేసుకున్నారు. అంబేద్కర్ హిందూ మతాన్ని కుల అసమానతలు లేని మతంగా తీర్చిదిద్దాలన్నాడు. కులాలకు మద్దతిస్తున్న గ్రంథాన్ని రద్దు చెయ్యమన్నాడంటే అర్థం అవి రద్దు చేశాక హిందూ మతం అసమానతలు లేని మతంగా నిలబడుతుందనే ఉద్దేశ్యం. అయితే, హిందూమతంలో ఇది సాధ్యం కాదని నిర్ణయించుకొని మత మార్పిడికి వెళ్ళిపోయాడు.

బాబాసాహెబ్ అలాంటి నిర్ణయం తీసుకునే పరిస్థితి కల్పించింది హిందూ సమాజమే. అంబేద్కర్ కుల నిర్మూలనలో చెప్పిన భావాలను మండలి అంగీకరించి, సహనంతో వాటిని ప్రచారంలోకి తెస్తే ఏమయ్యేది? కుల అసమానతలను ప్రభోదించే అంశాలు, శ్లోకాలు ఆయా గ్రంథాల నుండి తొలగించబడేవి. తద్వారా హిందూ గ్రంథాలలో కులానికి చోటు లేదని ప్రకటించుకునే అవకాశం వచ్చేది. కులతత్వానికి శాస్త్రాల మద్దతు లేదని, కులాన్ని పాటించడం శాస్త్ర సమ్మతం కాక శాస్త్ర వ్యతిరేకమయ్యేది. కులాలు దేవుని సృష్టి అనే భావం కూలిపోయేది. కులానికి దేవుని మద్దతు, శాస్త్రాల మద్దతు కూలిపోయాక ప్రజల మనసులలో కుల భావన తొలగిపోతుందని ఆయన భావించాడు.

అయితే ఇప్పుడు గమనించవలసిన విషయం ఇది 1936లో అంబేద్కరే చెప్పిన విషయం. అప్పుడు మండలివారు ఆ విషయాన్ని అంగీకరించలేదుకాని 1950 నుండి భారత రాజ్యాంగం అమలులోకి వచ్చాక కుల అసమానతలకు మద్దతు పలుకుతున్న శాస్త్రాలు, శ్లోకాలు చట్టబద్ధంగా రద్దయినట్లే. ఫలానా గ్రంథం ప్రకారం కులం సరైందే. కులబేధం పాటిస్తాం అంటే రాజ్యాంగం అంగీకరించదు. అంతేకాదు వాళ్ళని నేరస్థులుగా భావించి చర్యలు తీసుకుంటారు కూడా. కానీ అంబేద్కర్ ఆశించింది మనసులోంచి కుల భావనల్ని తీసివేయడమే. అలా జరగలేదు కదా మరింత ముదిరిపోయాయి.

శాస్త్రాల అధికారాన్ని తిరస్కరించడం ద్వారా కులాన్ని మూలల నుండి పెకలించి వేయాలన్న కల కలగానే ఉండిపోయింది. ఇప్పుడు కులాన్ని వేళ్ళతో సహా పీకివేయడం సాధ్యం కాదు. అంతమాత్రాన నిరాశ చెందనవసరం లేదు.

అంబేద్కర్ చేసిన మరో ముఖ్య ప్రతిపాదన ఇప్పుడు చేయదగ్గది, ఆచరించదగ్గది. అదే కులాంతర వివాహాలు. 'శాస్త్రాల దాస్యం నుండి విముక్తులైనవాళ్ళు కులాంతర వివాహాలు వారంతటవారే చేసుకుంటారు' అని అంబేద్కర్ అనడంలో అర్థం, చివరిగా కుల నిర్మూలన కులాంతర వివాహాల ద్వారానే జరుగుతందనేగా.

ఇప్పుడు మనం చేయవలసింది, చేయగలిగింది అదే. శాస్త్రాలననుసరించి కులభావన ఏర్పరచుకున్న రోజులు పోయి శాస్త్రాలు ఉన్నా లేకున్నా కులాన్ని వదిలే ప్రసక్తే లేదన్నట్లు చిట్లం గట్టుకు పోయింది కులం. అందువలన శాస్త్రాల విషయం అటుంచి కులాంతర వివాహాలే ఉద్యమంగా సాగాలి. కులాంతర వివాహాలు చేసుకున్న వారికి భారీ ప్రోత్సాహకాలివ్వాలి. వారికే ప్రత్యేక రిజర్వేషన్ కల్పించాలి. వారి పిల్లలను కేవలం భారతీయులు అని మాత్రమే పిలవాలి. గుర్తించాలి. ఆ విధంగా ఒక మహోన్నత భరతజాతి ఏర్పడటానికి కృషి చేయాలి. ఈ సందర్భంగా అంబేద్కర్ చెప్పిన మాటలు గుర్తు చేసుకుందాం. (కుల నిర్మూలనకు సరైన పద్ధతి కులాంతర వివాహాలే నని నా దృఢ విశ్వాసం. రక్త సమిశ్రణ ఒక్కటే మానవులలో అన్యోన్య అనుబంధ భావాన్ని, బాంధవ్యాన్ని కలిగిస్తుంది. అట్టి బంధుభావం లేనిదే కులం కల్పించిన విబేధాలను, వివక్షతలను రూపుమాపలేం. వివిధ కులాల మధ్య స్నేహానుబంధాలను కలిగించాలంటే, ఆయా కులాల, వ్యక్తుల నడుమ రక్త సంబంధాలను కల్పించక తప్పదు.) కులం, వర్ణం హద్దులు దాటి కులోన్మాదమే వ్యాధిగా మిగిలిన జాతికి కుల నిర్మూలన, వర్ణ నిర్మూలనా అనే వ్యర్థపూరిత చర్చలు ఆపి కులాంతర వివాహాలను ఉద్యమ దిశగా తీసుకువెళదాం. అదొక్కటే ఈ దేశానికి పట్టిన కుల పీడనలను వదిలిస్తుంది. బాబాసాహెబ్ కల నెరవేరుతుంది.

***

# 5. కుల నిర్మూలనా భారం - ఎవరిది?

- **డా॥ చిలుకోటి కూర్మయ్య,** పి.హెచ్‌డి.
విశ్రాంతి తెలుగు అధ్యాపకులు, రాజమండ్రి

"ప్రతి దానికి కులాన్ని తీసుకొచ్చేస్తున్నారు. ఇదొక దరిద్రమైపోయింది" అని కులాన్ని ఏదో సందర్భంలో తిట్టుకోని వారుండరు. ఇలా తిట్టుకునే వారిని రోజూ చూస్తూనే ఉంటాం. కులం వల్ల మమ్మల్ని తక్కువగా చూస్తున్నారని కొందరు బాధపడుతుంటే, కులం వల్ల మేం చాలా అవమానాలకు గురౌతున్నామని కొందరు తిట్టుకుంటున్నారు. మా కులం అందరికీ అలుసైపోయింది. మేమంటే గౌరవమే లేకుండా పోయిందని మరికొన్ని అగ్రకులాలు దిగులు పడిపోతున్నాయి. అసలు మెరిట్ ఏమైపోవాలి ప్రతి దానికీ ఈ రిజర్వేషన్ల గొడవేమిటి? అని బాధను వ్యక్తం చేస్తున్న వాళ్ళని రోజూ చూస్తూనే ఉంటాం.

ఇంతమందిని బాధలుపెడుతూ, ఇంతమందికి అసహనం కలగజేస్తూ, ఇంతమందిని ఇబ్బందులకు గురిచేస్తున్న కులాన్ని నిర్మూలించవచ్చేమో ననే ఆలోచన ఎందుకో చెయ్యలేకపోతున్నాం. సమాజానికి సమస్యలు వస్తున్నపుడు కలిసికట్టుగా పనిచేస్తున్నాం. కలిసికట్టుగా బ్రిటీష్‌వారి నుండి స్వరాజ్యాన్ని సాధించాం. చాలా దీర్ఘరోగాలని నయం చేసుకోగలిగాం. ఎన్నో సౌకర్యాలు ఏర్పాటు చేసుకోగలిగాం. ఈ మధ్య వచ్చిన కరోనా వ్యాధిని ఉమ్మడిగా ఎదిరించాం. ఇంతమందిని ఇన్ని రకాలుగా ఇబ్బందులకు అసహనానికి, గురిచేస్తున్న కులాన్ని నిర్మూలించే ప్రయత్నం ప్రారంభించలేకపోతున్నాం.

'కుల నిర్మూలన'. ఈ భావన భారతదేశంలో చాలామందికి పట్టని మాట. ఈమధ్యనే చినజియ్యరు స్వామి కులాలు అలాగే ఉంటాయి. కుల నిర్మూలన అనేది అర్థం లేని మాట అని చెప్పారు. హిందూమత పీఠాధిపతులెవరికీ కూడా నాకు తెలిసినంతవరకూ కుల నిర్మూలన ఒక అర్థంలేని మాట. గురూజీగా ప్రసిద్ధులైన ఆర్.యస్.యస్. గత అధిపతి బోల్వార్కర్ తన "బంచ్ ఆఫ్ థాట్స్" గ్రంథంలో అంటరానితనాన్ని సమస్యగా గుర్తించారు. కానీ కులాన్ని సమస్యగా గుర్తించలేదు. హిందువుల ఆత్మాభిమానం, హిందువులంతా బంధువులు అని ప్రచారం చేసే వారి ఉద్దేశ్యంలో కూడా కులాలు సనాతన సంప్రదాయంలో భాగం. కాబట్టి ఇది వారికి సమస్య కానే కాదు.

భారతదేశంలో కులం లేదు. కులాలు ఉన్నాయి. హిందూమతం అంటేనే కులాలు. కులాలు లేకుండా హిందూమతం లేదు. ఈ కులాల కుంపటిలోనే హిందూమతం కొనసాగుతోంది. మనం చరిత్రను గమనిస్తే ఈ కులాల గుంపుల్లో తమ కులాన్ని ఆధిపత్యంలో ఉంచుకోవడానికి అంటు, శుచి, ప్రార్థనలు, శాఖాహారం తీసుకోవడం, స్త్రీకి పునర్వివాహాన్ని నిషేధించడం వంటి పనులు ద్వారా, వ్రతాలు పూజలు చెయ్యడం ద్వారా తమ కులం గొప్ప చాటుకునే ప్రయత్నాలు జరుగుతూ ఉండేవి. ఈ రకంగా కులాధిపత్యపు పోరు కొనసాగుతుండేది. తెలుగులో వచ్చిన మొదటి నాటకం 'నందకి విజయం'. ఈ నాటకంలో బ్రాహ్మణ శాఖల్లోని వైదిక, నియోగి బ్రాహ్మణుల ఆధిపత్యపోరు కనిపిస్తుంది. ఈ ఆధిపత్యపోరు మంచిది కాదని కథనం. కానీ ఆధిపత్యపోరు వాస్తవం.

ఈ సంప్రదాయం ఇలా ఉంది. ఇది సనాతనం. దీన్ని మార్చవలసిన అవసరం లేదు. ఇది మారదు అనుకునేవారు దాన్ని అలా కొనసాగించాలనుకునేవారి ఆలోచనల్ని కాస్త ప్రక్కకు పెట్టి, ఈ కులాల వల్ల ఇబ్బందులు పడుతున్నాం అనుకుంటున్న సాధారణ ప్రజానీకం చాలా చాల ఎక్కువ. కానీ వారు కుల నిర్మూలన అనే ఆలోచన చెయ్యడం లేదు. ఆధిపత్య హిందూ కులాల్లో కానీ, అగ్రస్థానంలో ఉండే హిందూ కులాల్లో కానీ కుల నిర్మూలనని ఒక కార్యాచరణగా ముందుకు తీసుకొని వెళ్ళేవారు నాకు తెలిసిలేరు. అది వారికి అవసరం కూడా కాదు. హేతువాద నాస్తిక వాదుల్లో కులాన్ని అధిగమించగలిగిన శక్తి ఉంది. కానీ అది వారి ప్రధాన అజెండా కాదు. కమ్యూనిస్టు ఉద్యమం బలంగా ఉన్న రోజుల్లో కులం పట్టించుకోని అంశంగా ఉద్యమకారుల్లో ఉండేది. కులనిర్మూలన వారికీ ప్రధాన ఎజెండా కాదు. ఒక కార్యాచరణ అంటూ లేకుండా షెడ్యూల్డు కులాలకు సంబంధించిన కొద్దిమంది కుల నిర్మూలన తమ ఆశాదీపం అంటూ మాట్లాడుతూ ఉంటారు. దానికి కారణం అంబేడ్కర్ కులనిర్మూలన గ్రంథాన్ని రాయడం... నిజానికి షెడ్యూల్డు కులాల వారికి కుల నిర్మూలన అనే మాట తప్ప కార్యాచరణ ఏమీ లేదు. కుల నిర్మూలన అనేది భారతదేశంలో చాలామందికి పట్టని మాట.

మహాత్మాగాంధీజీ కానీ అటువంటి సంస్కరణవాదులు కానీ, గుల్వార్కర్ వంటి కార్యదక్షులు కానీ అంటరానితనాన్ని రూపుమాపితే చాలనుకున్నారు. కమ్యూనిస్టుల్లో ఒక వర్గంవారు కూడా కుల వివక్షాపోరాట సమితిని ఈమధ్య స్థాపించారు. 'కులనిర్మూలన' అవసరం అనుకున్నట్లుగా ఎవరూ భావించడం లేదు.

కులానికి ఉన్న లక్షణాలు చాలా ఉన్నాయి. వాటిలో మూడు ముఖ్యమైన లక్షణాలు ఉన్నాయి. (1) సహపంక్తి భోజన నిషేధం (2) కులాంతర వివాహాల నిషేధం (3) ఒక కులం కంటే మరో కులం ఎట్టి పరిస్థితుల్లోనూ సామాజిక స్థాయిలో సమానం కాకపోవడం ఇవి మూడు కులానికున్న ప్రత్యేకమైన లక్షణాలు. కులాల దొంతరలో ప్రతి కులానికీ తమకంటె తక్కువ కులాలు మత సాంఘిక స్థాయికి రాకుండా చూసుకోవడం కూడా చాలా ప్రధానమైన అంశం. భోజనం, వివాహం అరుదుగా వచ్చే అంశాలయితే, కులస్థాయిని కాపాడుకోవడం నిరంతరం కొనసాగే అంశం.

ఆధునిక భావజాలం, వైజ్ఞానిక ఆవిష్కరణలు కుల వ్యవస్థ పాత కట్టుబాట్లలో చాలా మార్పులు తీసుకువచ్చాయి. బ్రాహ్మణ వివాహాల్లో ప్రాయశ్చిత్తకాండ ఒకటి ఉంటుంది. దానిలో శూద్రస్పర్శన, చండాల భాషణ చేసినందుకు ప్రాయశ్చిత్తం ఉంటుంది. ఈరోజు మంత్రం చదివితే చదవవచ్చు కాని వాటిని పాటించడం ఈ ఆధునిక కాలంలో సాధ్యం కాదు. కులానికి మొదటి లక్షణమైన సహపంక్తి భోజన నిషేధం పట్టు సడలుతోంది. వేడుకల్లోనూ, హొటళ్ళలోనూ, రాజకీయ కార్యకలాపాల్లోనూ మన ప్రక్క ఎవరు కూర్చుని తింటున్నారు అనేది పట్టించుకోవడం లేదు. పట్టుదారి పెళ్ళి, వేడుకకి కులంతో పట్టింపు లేకుండానే భోజనానికి పిలుస్తున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో అన్ని కులాల వారినీ భోజనానికి పిలవడం సాధ్యం కాదు. అయితే ఒకప్పటిలా కాక పట్టు సడలుతోంది.

రెండవ లక్షణమైన కులాంతర వివాహాలు నిషేధం ఇప్పటికీ పటిష్టంగానే ఉంది. 1955లో ప్రత్యేక వివాహ చట్టం వచ్చినప్పటికీ ఆధునిక భావజాల ప్రభావంతో మనుష్యులందరూ సమానమనే భావధార కొనసాగుతున్నప్పటికీ కులాన్ని అధిగమించి వివాహం చేసుకోవడం కష్టంగానే ఉంది. 2011 జనాభా లెక్కల ప్రకారం కులాంతర వివాహాలు చేసుకొన్న వారి శాతం 4% దాటింది. ఆసక్తికరమైన అంశమేమిటంటే 6% మంది బ్రాహ్మణులు కులాంతర వివాహాలు చేసుకొని ఈ విషయంలో మిగిలిన కులాలకంటే ముందున్నారు. 1955 చట్టం వివాహ వయస్సు ఉన్న ఏ ఇద్దరు స్త్రీ పురుషులైనా కుల, మత పట్టింపు లేకుండా వివాహ బంధంలోకి రావచ్చు. వారికి చట్టం రక్షణ కల్పిస్తుంది. ఈ చట్టం రాకముందు హిందువుల్లో కులాంతర వివాహాలు నేరం.

ఈ చట్టం ఉన్నప్పటికీ ఉత్తర భారతదేశంలోని కాఫ్ పంచాయితీలు కులాంతర వివాహాల్ని నిషేధిస్తూనే ఉన్నాయి. దక్షిణ భారతంలో ఆధిపత్యకులంగా తమని తాము భావించుకునే కొద్దిమంది దుర్మార్గంగా ప్రవర్తించడం చూస్తున్నాం. ఈ ప్రవర్తనకి హిందూమత భావజాలమే కారణం - అందుకే డా॥ బి.ఆర్. అంబేద్కర్ వేదశాస్త్ర విహితమైన హిందూ భావజాలం మీద మీ దాడిని కొనసాగించండి అని జాత్‌పాత్ తోడక్ మండలి వారికి పిలుపు నివ్వాలనుకున్నారు.

కుల వ్యవస్థలో ఉన్న మూడవ లక్షణం, ఒక దుర్మార్గమైన అనునిత్యం మనల్ని వెంటాడే ఆచరణ. ఎదుటబడిన వ్యక్తి కులం ద్వారా స్థాయిని నిర్ణయించుకోవడం. మనకు పరిచయం లేని వ్యక్తి అయినా అతనిది మన కులం అని తెలిస్తే చిన్న ఆనందాన్ని అనుభవిస్తాం. ఏ ప్రయోజనం ఆశించకుండానే. ఎందుకంటే హిందూ సమాజంలో కులంతోనే మన బ్రతుకు ముడిపడి ఉంటుంది. కాబట్టి మన కులంవాడే మనవాడు అనే బంధుత్వ భావన కులంలో ఉంది.

కులం ఈ రోజు కొత్తరూపాన్ని సంతరించుకుంది. ఆధిపత్య కులాలు అధికారం చెలాయించడం ప్రారంభమైయ్యింది. ఈ ఆధిపత్య కులాలు ఎంత ప్రమాదకరమైనవో 1954లో భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడిన సందర్భంలో డా॥ బి.ఆర్. అంబేద్కర్ ఒక వ్యాసం రాశారు. ఎమ్.ఎల్. శ్రీనివాసన్ అనే సామాజిక శాస్త్రవేత్త ఆధిపత్య కులంపై పరిశోధన చేశారు. అంబేద్కర్ ఆ వ్యాసంలో వీటిని భాషా ప్రయుక్త రాష్ట్రాలు అనడం కంటె, పంజాబ్‌ను జాఠ్ రాష్ట్రంగానూ, మహారాష్ట్రని తుషారా రాష్ట్రంగాను, ఆంధ్రప్రదేశ్‌ని రెడ్డి రాష్ట్రంగానూ, చెబితే ఈ ఆధిపత్య కులాలకు స్వరాజ్య ఫలంను అందించిన ప్రమాదాన్ని మనం స్పష్టంగా అర్థం చేసుకోగలం అంటారు. ప్రతి రాష్ట్రంలోనూ రెండు మూడు ఆధిపత్య కులాలు ఉంటాయి. ఆంధ్రప్రదేశ్‌లో రెడ్డి, కాపు కమ్మలు ఆధిపత్య కులాలు. వీరిమీదే చిన్న కులాలు ఆధారపడి ఉండాలి. అణిగిమణిగి ఉండాలి. మహారాష్ట్ర గ్రామీణ ప్రాంతంలో బ్రాహ్మణులు, బనియాలు బలపం లేకుండా గడిపిన కాలం ఒకటి ఉంది. ఈరోజు మరాఠావారి ఆధిపత్యంలో గ్రామాల్లో నివసించలేక పట్టణాలకు వలసపోతున్నారు. బ్రాహ్మణులు, బనియాలు, కోమట్ల అంటరానివారు ఈ మరాఠీలకు అణిగిమణిగి సహకరిస్తూ బ్రతుకు ఈడ్చవలసిందే" అని డా॥ బి.ఆర్. అంబేద్కర్ పేర్కొన్నారు.

ఆధిపత్య కులాలకి ప్రజాస్వామ్య వ్యవస్థలో అధికారాన్ని నిలుపుకోవడానికి, దాన్ని ఆధిపత్య ధోరణిలో కొనసాగించడానికి కులవ్యవస్థ చక్కని సాయం చేస్తోంది. ఆధిపత్య కులం సంఘటితంగానూ, మిగిలిన కులాలు అనుసరించే కులాలుగా మారక తప్పని పరిస్థితిని ఈ కులవ్యవస్థ కలుగజేస్తోంది. ఒక సహజమైన సమస్య కోసం కలిసి పనిచెయ్యలేని అనుమానాలు ఈ కులం కలగజేస్తోంది.

ఏదో సందర్భంలో ఈ కులవ్యవస్థని అందరూ తిట్టుకుంటూనే ఉంటారు. ఈ కులవ్యవస్థని మనం పోగొట్టుకోవచ్చుకదా అని కనీసం కూడా ఆలోచించరు. మారుతున్న కాలంతోపాటు దానిలోనూ మార్పు వస్తుందని ఎదురుచూస్తున్నవారు కొందరున్నారు.

కుల నిర్మూలన జరగాలి. అయితే దీనికి ఎవరు నడుం బిగించాలి. పిల్లికి గంట కట్టేదెవరో తెలియదు. కులవ్యవస్థ నిర్మూలన కోసం బ్రిటీష్ ఇండియాలో 1930 ప్రాంతంలో లాహోరు కేంద్రంగా జాత్‌పాత్ తోడక్ మండలి అనే సంస్థ ప్రారంభమైయ్యింది. ఆ సంస్థవారు 1935లో తమ వార్షికోత్సవ సభకు అధ్యక్షత వహించవలసిందిగా అంబేద్కర్‌ని కోరారు. అంబేద్కర్ అప్పటికీ నేను హిందువుగా పుట్టాను. హిందువుగా చావను అనడమే కాకుండా హిందూమతం నుండి మారతానని బహిరంగ ప్రకటన చేశారు. (అంబేద్కర్ రాసిన ఉపన్యాస గ్రంథం కుల నిర్మూలన తప్పనిసరిగా చదవవలసిన గ్రంథం)

కుల నిర్మూలనకు కొన్ని సూచనలు చేస్తూ డా॥ బి.ఆర్. అంబేద్కర్ సహపంక్తి భోజనాలు, కులాంతర వివాహాలు అవసరమే కాని సహపంక్తి భోజనాలు చెయ్యకపోవడానికి, కులాంతర వివాహాలు చేసుకోకపోవడానికి ప్రధానమైన కారణం వేదశాస్త్రాలు. ఇవి నిజానికి శాసనబద్దం చెయ్యబడ్డ వర్గనీతి యొక్క శిక్షాస్మృతి. ఈ శిక్షాస్మృతినే ప్రజలు మతంగా నమ్ముతున్నారు. ఈ ఆదేశ నిర్దేశాలు ప్రజల నైతిక జీవనంలోనూ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పతనం కావడంలోనూ సహకరించే నిబద్ధతలు. ఇవి ఆధారాలు కావు. కాబట్టి ఈ వేద శాస్త్రాల ముసుగును తీసివేస్తే ప్రజలే ఏం చెయ్యాలో నిర్ణయించుకుంటారని చెప్పారు. అంబేద్కర్ అభిప్రాయాలు నచ్చక ఆ కుల నిర్మూలన మండలివారు సభను రద్దు చేసుకున్నారు ఇది వేరే విషయం.

అంబేద్కర్ కులాలు పోవాలని కోరుకున్నారు. కుల వ్యవస్థ మీద అంబేద్కర్ చేసినంత పరిశోధన చేసినవారు చాలా తక్కువమంది. కుల వ్యవస్థ అత్యంత హేయమైన ఇబ్బందుల్ని ఎదుర్కొని కులాల నించి వచ్చిందన్నారాయన. మొదట్లో దేవాలయ ప్రవేశాలలాంటి ప్రయోగాలు చేసిన త్వరలోనే ఆయన ఆలోచన మార్చుకున్నారు. హిందూమతాన్ని కానీ, కుల వ్యవస్థని కానీ సంస్కరించడం తన పనికాదనుకున్నారు. అంటరానివారికి సమానత్వ హక్కుల్ని, స్వేచ్ఛని, గౌరవప్రదమైన జీవితాన్ని ఇవ్వడానికి కృషి చేసారు. అంటరానివార్ని హిందూమతం నుండి మతాంతరీకరించే కార్యక్రమం చేపట్టారు. దేవాలయ ప్రవేశం బిల్లు ప్రవేశ పెడుతున్నపుడు ఇలాంటి చిన్న విషయాల కోసం అంటరానివారు తమ శక్తిని నాశనం చేసుకోవద్దని చెప్పారు. ఉన్నత విద్య ఉన్నత ఉద్యోగం గౌరవప్రదమైన జీవితం ఈ మార్గమే ముఖ్యమని చెప్పారు. దీనివల్ల అభివృద్ధి జరుగుతుంది. దానితోపాటు సవర్ణ హిందూ సమాజం వీర్ని చూసే దృష్టి మారుతుంది. అందుకోసం కృషి చెయ్యమని చెప్పారు. కుల నిర్మూలనా భారాన్ని అంబేద్కర్ నెత్తిన వేసుకోలేదు. ఆ బాధ్యత దళితులకు అప్పగించలేదు.

***

"కులం అనేది కొన్ని మత విశ్వాసాల కారణంగా ఏర్పడిన వ్యవస్థ. ఆ మత విశ్వాసాలకు శాస్త్రాల మద్దతు ఉంది. ఆ శాస్త్రాలు దైవ సమానులైన ఋషులచే ప్రతిపాదించబడినట్టినవే ప్రతీతి వుంది. ఆ ఋషులు మానవాతీత శక్తులు కలవారనీ, మహాజ్ఞానులనీ, అట్టివారి ఆదేశాలను ధిక్కరించడం మహాపాపమని, ప్రజలకు ఒక నమ్మకం ఉంది. అందువల్ల – కులవ్యవస్థను వదులుకొమ్మని ప్రజలను కోరడం వారి ప్రాథమిక మత భావాలకు విరుద్ధంగా వారిని నడుచుకో మనడమే."

# 6. కులద్వేషాలు ఇంకెన్నాళ్ళు?

– **డా॥ బోయి విజయభారతి,** రచయిత్రి, అనువాదకురాలు, హైదరాబాదు

వర్తమాన సమాజంలో కులం ఒక పెనుభూతంగా కనిపిస్తున్నది. ఇది భూతమే – అంటే గత కాలపు మూఢ నమ్మకం. అరిష్ట భావన ఇది. వర్తమానంలో ఈ భావన సామాజిక రాజకీయ రంగాలను ఎంతగా ప్రభావితం చేస్తున్నదో మనం చూస్తున్నాం. కులాభిమానం, కులద్వేషం – కులహత్యలు – చాలా తరచుగా జనాన్ని రెచ్చగొడుతున్నాయి. మరింత హింసకు దారి తీస్తున్నాయి. భవిష్యత్తులో ఇలాంటి వాతావరణం ఉండకుండా మనం జాగ్రత్త పడాలి. ఇది దేశ భవిష్యత్తుకే ప్రమాదకరం.

అసలు కులం అంటే ఏమిటి? అదొక మిథ్యా భావన. స్వార్థపరులైన కొందరు తమ అధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం కల్పించిన మిథ్యా భావన. కొన్ని వర్గాలు తమ ఐశ్వర్యాన్నీ ఆధిక్యతనూ నిలుపుకోవటం కోసం కులతత్వ భావన ప్రవేశపెట్టారు. ఇండియాలోని ప్రాచీన సమాజాలలో కులం భావన లేదు. కులం వర్ణం లేదు. భోగలాలసత కొందరు రాయించిన / రాసిన మనుధర్మ శాస్త్రం వంటి కొన్ని గ్రంథాలు ఈ కుల / వర్ణ భావనలను ప్రచారం చేశాయి. అసలు కులం అనే పదానికే ఉన్న అర్థాలు ఏమిటో చూద్దాం.

1. వంశము, 2. తెగ, 3. ఊరు, 4. ఇల్లు, 5. శరీరము

ప్రాచీన సాహిత్యంలో కులం అనే పదాన్ని వంశం అనే అర్థాలలోనే ఉపయోగించారు.

"కులమ విరత సంతతి నెగడ..." కులం కొనసాగేందుకు అంటే వంశం కొనసాగేందుకు – అంటే వంశం కొనసాగేందుకు దేవర న్యాయంగా తన కోడళ్ళకు సంతానం కలిగించాలని సత్యవతి వ్యాసుడిని కోరిందట. ఇది మహాభారతంలోని సందర్భం. నన్నయభట్టు ఈ పదాన్ని వంశం అనే అర్థంలో వాడాడు. భారతం ఆదికాండం కులం అనేది సముదాయాన్ని, సమూహాన్ని కూడా తెలియజేస్తుంది. పూర్వ సమాజాలలో ముఖ్యంగా జైన సంప్రదాయంలో ఒకే జాతిలోని అతి చిన్న

విభాగాన్ని 'కుల' అనేవారు. ఒక వీధిలోని వాళ్ళంతా ఏక కులం. ఒకే వాడలో వుండే వారూ అలాగే ఒక కులం (యూనిట్) గా పరిగణింపబడేవారు. ఇక్కడ జాతి అంటే ఒకే విధమైన నమ్మకాలు, ఆచార వ్యవహారాలు కలిగిన వారు అని–

ఇండియా అనే 5 జాతుల ప్రజలకు ఆలవాలంగా ఉంది. ఒక్కో జాతికీ ఒక్క విధమైన జీవన విధానం ఉండేది. అయినా ఆ జాతులతో కలసి ఉండేది. వైవిధ్యం తప్ప వైరుధ్యాలు లేవు. అలాగే అవి పురోగమించాయి. హిందూ పురాణాలలోని కథలు పరిశీలిస్తే ప్రజలందరూ – ముఖ్యంగా రాజులందరూ సూర్య వంశానికి, చంద్ర వంశానికి చెందిన వారుగా కనబడతారు.

ఏకవర్ణ మిదం సర్వం అంటున్నది భారతం. మనుషులంతా ఒకే వర్ణం అంటున్నది. వర్ణభావన మనుధర్మశాస్త్రం ప్రవేశపెట్టిన భావన. మానవ సముదాయాన్ని నాలుగు వర్ణాలుగా విభజించి చెప్పటమే మనుషుల మధ్య ఎక్కువ తక్కువలు సృష్టించింది. అందుకు కొన్ని నియమ నిబంధనలు ఏర్పరచింది. అవన్నీ సృష్టి మొదటి నుంచీ ఉన్నాయని నమ్మించటానికి అప్పటికి ప్రచారంలో ఉన్న కథలలోకీ ఇతిహాసాలలోకీ ఆ నియమాలను నేర్పుగా ఇరికించింది. రామాయణంలోనూ భారతంలోనూ చేర్చేసింది.

ప్రజలకు వేదాలమీద గొప్ప నమ్మకం – కాబట్టి ఋగ్వేదంలో ఉన్నది అంటూ పురుష సూక్తాన్ని అందులో చేర్చేశారు. జీవ పరిణామ క్రమానికి విరుద్ధంగా ఉన్న ఆ నమ్మకాలను మతంతో ముడిపెట్టటం వల్ల ప్రజలు అంధ విశ్వాసాలలో కూరుకుపోయారు.

పది అంగుళాల ప్రమాణాలలో ఉన్న పురుషుడిని మథిస్తే అతని అవయవాల నుండి రకరకాల జీవులు పుట్టారట. ఏక కణ జీవుల పరిణామ క్రమంలో ఈ సృష్టి ఏర్పడిందని అనుకోవచ్చునేమో ఇది.

పూర్వ సమాజాలలో వృత్తులుండేవి. వృత్తి కులాలుండేవి. కులం అంటే సముదాయం అనే అర్థమే ఇక్కడ చెప్పుకోవాలి. ఒకే యింట్లో భిన్న వృత్తుల వారుండేవారు. వృత్తులు వంశ పారంపర్యంగా లేవు. మనుస్మృతి తర్వాతనే వృత్తి

కులాలు ఘనీభవించుకు పోయాయి. భిన్న సమాజాల మధ్య – జాతుల మధ్య వివాహ సంబంధాలుండేవి. వశిష్టుడు మాతంగ కులానికి చెందిన అరుంధతిని వివాహం చేసుకున్నాడు. మందపాలుడు అనే ముని సారంగి అనే ఆమెను వివాహమాడిన కథ ఉంది మహాభారతంలో. సంకేతాలతో చెప్పటం పురాణాలలో ఉంది. స్థానిక తెగలకు – ప్రధాన జీవన స్రవంతిలోని వారికి కూడా సంకేత చిహ్నాలుంటాయి. పాము, పక్షి, ఏనుగు వంటి గుర్తులు – అవి ఇప్పటి రాజకీయ పార్టీలు జెండాల (గుర్తులు) వంటివి. మందపాలుని కథ ఖాండవవన దహనం సందర్భంలో వస్తుంది.

తపస్సంపన్నులైన మునులు స్థానిక తెగల స్త్రీలను వివాహం చేసుకున్నారన్న విషయాలను పురాణాలు ప్రతీకలతో చెప్పాయి. పాముల నుండి (నాగకన్యలు) పక్షుల నుండి మునులు సంతానాన్ని పొందారు. వంశాలను నిలబెట్టుకున్నారు. శంతన మహారాజు జాలరి. స్త్రీ సత్యవతిని వివాహం చేసుకునే గంగ వల్ల తనకు పుట్టిన కుమారుడికి కాకుండా సత్యవతి సంతానానికే రాజ్యం ఇచ్చాడు. కులం సంతానానికే రాజ్యం ఇచ్చాడు. కులం నిలిచే బాధ్యత ఆమెదే అయింది. ఆ వివాహాన్ని ఆ ఏర్పాటునూ అప్పటి సమాజం వ్యతిరేకించలేదు. కుంతి వేర్వేరు జాతుల పురుషుల వల్ల సంతానాన్ని పొంది పాండు రాజు వంశం నిలిపింది. అక్కడ అది ఎవరూ తప్పు పట్టలేదు. పైగా కుంతి కొడుకులకు రాజ్యంలో భాగం ఉన్నదని సమర్ధించారు కూడా–

మనుధర్మశాస్త్ర వర్ణాలనూ భిన్న వర్ణాల స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలవల్ల కలిగిన సంతానాన్ని వేర్వేరుగా వర్గీకరించి సమాజాన్ని అతలాకుతలం చేసింది. వర్ణవర్గాల ఏర్పాటు అధర్మం. మంచి గతమున కొంచెమేనోయ్ అని గ్రహించి మనం సమాజాన్ని కాపాడుకోవలసి ఉంది.

వర్ణధర్మాలు కుల ధర్మాలు స్త్రీల అణచివేతకు దారి తీశాయి. స్త్రీలు శూద్ర వర్ణాల / కులాలవారూ ఇక్కడ బాధితులు.

మనుధర్మం మాతృస్వామ్యాన్ని దెబ్బతీసింది. శూద్రుల జ్ఞానార్జనను దెబ్బతీసింది. అది రామాయణ కథలో చూడవచ్చు. దశరథుడు కైకేయికి ఇచ్చిన

మాట ప్రకారం రాజ్యాభిషేకం ఏర్పాటు చేసినట్టు రామాయణం చెబుతోంది. సత్యవాక్య పరిపాలకుడని రాముడిని పొగిడింది. నాగరాణి తాటకను చంపటం ద్వారా రాముడు మాతృస్వామ్యాన్ని నాశనం చేశాడు.

మతంగుడు రాముని కాలానికి ముందటి వాడే. మతంగుని తపస్సు ఎవరూ కాదన లేరు. రాముడు శంబూకుడిని చంపటం తపస్సు చేస్తున్నాడనే కారణం చూపి మరీ చంపటం మనువాదాన్ని స్థిరపరచటానికే.

రామరాజ్యానికి ముందు అసుర సంస్కృతి – శ్రమల సంస్కృతి వ్యాప్తిలా వుండేది. సమధర్మం – సమన్యాయం ఉండేవి. కులద్వేషాలు లేవు. మనువాదం జాతుల మధ్య బేధాలు చెప్పి వారిలో ద్వేషం నింపింది.

కులాల మధ్య వైరుధ్యాలు సృష్టిస్తూ భారతంలోనూ ఇతర పురాణాలలోనూ చేర్చిన సన్నివేశాలతోనూ కులానికి మతాలతో బోధించటం వల్లనూ సమాజంలో కుల భావనను బలంగా నాటుకున్నాయి.

మానవులంతా ఒకటేననే అందర్నీ నేనే సృష్టించాను అని ఆ భగవంతుడే వచ్చి చెప్పినా జనం నమ్మేటట్టు లేరు.

అందర్నీ నేనే సృష్టించాను. వారు గుణకర్మలచేత నాలుగు వర్ణాలు అన్నాడని మరో పాదం లేవనెత్తారు, "జన్మనా జాయతే శూద్ర" పుట్టుకతో అందరూ శూద్రులు (క్షుద్రులు) – విద్యతో విప్రులు అవుతారు. బలంతో క్షత్రియులు అవుతారు. బ్రహ్మజ్ఞానంతో బ్రాహ్మణులు అవుతారు అని చెప్పారు. జ్ఞానం అంటే మోక్షం మీది ఆసక్తి అనీ చెప్పారు. విప్రులు అంటే బ్రహ్మణులు అనే వ్యవహారం మొదట్లో లేదు. జ్ఞానం వేరు విజ్ఞానం వేరు అని అర్థమేమో.

శాస్త్రజ్ఞానం విజ్ఞానం. ఆ విధంగా అది విద్య. విద్యావంతులందరూ విప్రులే– ఇప్పటి డాక్టర్లు, ఇంజనీర్ల లాగా విద్య వల్ల గుర్తింపు ఉండేది. వారి మధ్య వివక్ష ఎప్పుడూ లేదు.

పూర్వం గ్రామస్థాయిలో పాలనా వ్యవహారాలు చూడటానికీ. పన్నిద్దరు (12) ఆయగాళ్ళుండేవారు. వారిలో అన్ని వృత్తుల వారూ సమస్థాయిలో ఉండేవారు.

గ్రామ ఆదాయంలో వారికి భాగం ఉండేది. చాకలి, మంగలి, మాదిగ, మాల వంటి వృత్తి కులాలకు చెందిన సభ్యులు అందులో ఉండేవారు. వృత్తులు పుట్టుకతో నిర్ణయింపబడేవి కావు. కులం అంటే కుటుంబం అనే వ్యవహారం ఉన్నది కాబట్టి అవి వంశపారంపర్యంగా ఒకరిద్దరికి, ఆ వృత్తిలో ఆసక్తి ఉన్నవారికి పరంపరగా వచ్చేవి – అంతేకాని పుట్టుకతో వారు కులవృత్తినే తప్పనిసరిగా చేయాలనే ఆంక్షలు లేవు. కులవృత్తులు నిరాకరించిన వారూ ఉన్నారు. అందుకే "కులవృత్తికి సాటి లేదు గువ్వలచెన్నా" అంటూ ప్రచారాలు చేయవలసి వచ్చింది. స్వధర్మం అంటూ కొన్ని కుటుంబాలను బలవంతం చేస్తూ ధర్మసూత్రాలు రాయవలసి వచ్చింది. పురుషసూక్తంలోని వర్ణ ఉదంతం హేతువుకు నిలవదు గనుక పాలకులు కుటుంబాల పరంగా కులాన్ని ఆధారం చేసుకుని సమాజాన్ని విభజించి పాలించారు. గుణ శీలాదులతో వర్ణాన్ని నిర్ణయించటం కష్టం – పుట్టుకను బట్టి నిర్ణయించటం తేలిక. కాబట్టి వర్ణాన్ని కులానికి అన్వయించి పుట్టుకకు అంటగట్టారు. కులం వర్ణానికి సమానార్థంగా ప్రచారం అయింది. ఇదో కుట్ర.

పుట్టుకతో శూద్రులే అయినా ప్రవర్తనతో గుణ శీలాలలో బ్రాహ్మణులు అయినవారు చాలా తక్కువ. కుటుంబాలను నిలబెట్టుకోవటం కోసం అధికారం కోసం – ఈ కుట్రలు జరిగాయి. అయినా బ్రాహ్మణ జనాభా తక్కువే అయింది. మతంగుడు తపస్సు చేసి కర్ధమ ప్రజాపతి అయ్యాడు. ఆయన కూతుళ్ళు మహర్షుల భార్యలు. వాళ్ళలో అరుంధతి ఒకతె. వారి సోదరుడు కపిలుడు గొప్ప విజ్ఞాని. ఇవన్నీ పురాణాలే ఒప్పుకున్నాయి.

బ్రహ్మ మానస పుత్రులుగా కొందరిని చెప్పారు. వారి సంతానంలో – కాలక్రమంలో కొందరు వైశ్యులూ, కొందరు రాజులూ అయ్యారు.

శాపగ్రస్తులైనవారు కొందరు వెలివేయబడి తక్కువ కులాలవారు అయ్యారు. ఈ విధంగా ఇండియాలోని శాఖలన్నీ ఒకే మూలం కలవి. వలసవచ్చిన వారూ స్థానిక గిరిజనులు – సంచార జాతులు అందరూ కాలక్రమంలో కలిసిపోయిన సందర్భాలున్నట్లు హిందూ పురాణాలు చెబుతున్నాయి. గిరిజన బాలిక పార్వతి శివుని భార్య తల్లిదండ్రులెవరో తెలియని సీత జనకుని పెంపుడు కూతురు.

విశ్వామిత్రుడు మాతంగ కవులను పెంచుకున్నాడు. అలాగే ద్రౌపది ఆమె సోదరుడూ ద్రుపద మహారాజుకు సొంత సంతానం కాదు – యజ్ఞకుండంలోంచి వచ్చారనటం అద్భుతమైన కల్పన–

ఈ విధంగా కులాన్ని అర్థం చేసుకోవాలి. కులపతి కులధర్మం – కుల వధువు – కుల ధర్మపత్ని అంటూ సమాజాన్ని – ముఖ్యంగా స్త్రీలను సేవక వర్గాలను నియంత్రించటానికే అగ్ర ఆధిపత్య వర్గాలు కర్మకాండనూ ఆచారాలనూ వారిపై రుద్దారు.

మానవులోని గుణశీలాలను బట్టి అంటే సత్వరజస్తమోగుణాలను బట్టి అతని వర్ణం నిర్ణయించేవారు. పుట్టుకతో అందరూ ఒకే వర్ణం. ఆ భావన తర్వాతి కాలాలలో పోయింది. వృత్తి కులాల (కుటుంబాల)ను బట్టి అంటే కుటుంబ పరంగా వర్ణం నిర్ణయించే పరిస్థితి ఏర్పడింది. ఏర్పడలేదు – ఏర్పరచారు. వర్ణాన్నీ కులాన్నీ కలిపేసి వ్యవహరించటంతో వర్ణం కులాలకు (కుటుంబాలకు) ఆపాదించారు. దానికి మతాన్ని జత చేయటంతో తప్పుడు అవగాహన ఏర్పడింది. ఈ గందరగోళాన్ని అర్థం చేసుకోవాలి. వర్ణమూ, కులమూ ఒకటి కాదు.

అపోహలతో అపార్థాలతో తప్పుడు అభిప్రాయాలు ఏర్పడటం జరిగి కుల దురహంకారం సమాజంలో చోటు చేసుకున్నది. కింది కులాలుగా ముద్ర వేయబడ్డవారు చాలా దారుణమైన పరిస్థితినీ ద్వేషాన్నీ ఎదుర్కోవలసి వస్తున్నది. ఈ అవగాహన – తప్పు అవగాహన – దీనిని సరిదిద్దాలి. కులాలను నిర్మూలించటం అసాధ్యం. ఎందుకంటే అది కుటుంబ వ్యవస్థ మనం కులతత్వాన్ని నిర్మూలించగలం. జరగవలసింది అదే. పొరుగువారిపట్ల మానవతా భావం – మైత్రి – గౌరవం – ఫలానా కులం అనగానే అకారణంగానే ద్వేషించే తత్వమే ఒక కులం ఉత్తమమైనదీ ఉన్నతమైనదీ మరో కులం అధమమైనదీ అనే భావన ఉండటమే కులతత్వం. ఎవరికైనా తాను పుట్టిన కులం తనకు గొప్పది. ఒక కులం గొప్పదీ మరొకటి తక్కువదీ కాదు – కులాభిమానం ఉండ వలసిందే కాని కులద్వేషం తగనిది. కులాలకు ఆపాదించే గుణాలు కూడా అసహజమైనవే – కుట్రపూరిత మైనవే. వాటిని అర్థం చేసుకోగలగాలి.

ప్రాచీన ఇండియాలో భిన్న జాతుల వారు సామరస్యంతో మెలిగారు. ఆధునిక భారతదేశంలో మనం అలా ఉండలేదూ? "మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే" (యజుర్వేదంలో మంత్రం) – నేను సృష్టిలోని అన్ని ప్రాణులను (సర్వ భూతాని) మిత్రులవలె చూస్తాను – అని మన పూర్వీకుల చేత అనిపించారు. ఇక్కడ మైత్రి తప్ప ద్వేషం లేదు. ఇంకో విషయం కూడా గమనించాలి. "యత్ర విశ్వం భవత్యేక నీడమ్" ఎక్కడ విశ్వం ఒకే గొడుగు కింద (నీడ) ఉంటుందో అనే భావన పూర్వ సమాజాలలో ఉన్నది.

పాలకులు – వారిని ఆశ్రయించి జీవించే వర్గాలూ చేసిన కూటనీతి (చట్టాలు / ధర్మసూత్రాలు వల్ల ద్వేషపూరిత సమాజం – కులాన్నీ ఆశ్రయంగా చేసుకుంటున్నది. ఇది కొనసాగకూడదు. ప్రాచీన ధర్మసూత్రాలకు – స్మృతులు ఇన్ని వచ్చాయంటే అవి కాలానుగుణమైన సవరణలతో వచ్చినట్లే కదా. మనుస్మృతిని కాదని గౌతమస్మృతి, ఆపస్తంబ స్మృతి రాలేదా? అలాగే కుల వాదాలు కూడా మార్చుకోవలసిన అవసరం ఉన్నది. ఆ అసత్యాల నుంచి మనం బయట పడాలి.

జ్ఞానాన్ని కట్టడి చేసేందుకు కుల విద్యల పేరిట కుట్రలు జరిగాయి. కులం అనేది ప్రాణులకే కాదు. కనిపించిన అన్నింటికీ అంటగట్టిన మేధావులున్నారు. గ్రహాలకూ – నక్షత్రాలకూ – అక్షరాలకు ఉచ్ఛ నీచ పరిగణనలు చేశారు – కొన్ని దుర్మహూర్తాలు, కొన్ని వర్జ్యాలు అంటూ కాలగణనకూ తరతమ బేధాలు చెప్పారు ఇవన్నీ ప్రజలను మూఢనమ్మకాలలో ఉంచేందుకే స్వార్ధం కోసమూ, జీవనం కోసమూ ప్రచారమైనాయి.

"శాస్త్రవిజ్ఞానం పెరుగుతున్న ఈ రోజులలో కాలాన్ని గురించి కులాన్ని గురించిన అపోహలు తొలగించుకోవలసిన అవసరం ఉంది.

కులాన్ని నిర్మూలించడం కాదు – కుల భావనను నిర్మూలించాలి. కులం అంటే సముదాయం. ఇతర సముదాయాలనూ, సమాజాలనూ వంశాలనూ కుటుంబాలనూ ద్వేషించటం మానాలి.

వసుధైక కుటుంబ భావన భావిపౌరులలో – యువతరంలో నెలకొల్పటానికి ప్రయత్నిద్దాం. కులం అంటే కుటుంబ సంబంధి. – ఫలానా కుటుంబంలో పుట్టాడు అదే గుర్తింపు – ఇది సామాజికం.

వర్ణం, వ్యక్తి సంబంధి. గుణశీలాలకు సంబంధించినది. వ్యక్తిత్వానికి సంబంధించినది. కులం కుటుంబాన్ని ఆశ్రయించుకుని ఉంటుంది. కుటుంబ వ్యవస్థను నిర్మూలించలేము. వర్ణ వ్యవస్థ కూడా వాస్తవికమూ యదార్ధమూ కాదు. గుణాల వల్ల మనుషులను వర్గీకరించలేము. స్వభావాల వల్లనూ వర్గీకరించలేము. ఏదో కొన్ని లక్షణాలను బట్టి వర్ణాలు నిర్ణయించలేము.

అయితే కులమూ, వర్ణమూ ఒకటి కాదు అని మాత్రం తెలుసుకోవాలి. తప్పు అవగాహనల వల్ల ప్రచారంలోకి వచ్చిన ఈ భావనలు సమాజాన్ని మరింత కలుషితం చేయకుండా జాగ్రత్త పడాలి.

***

"ప్రతి స్త్రీనీ, ప్రతి పురుషుడినీ శాస్త్రాల దాస్యం నుండి విముక్తుల్ని చేయండి. శాస్త్రాలు బోధిస్తున్న అక్రమ దుష్టభావాలను వారి మనస్సుల నుంచి తుడిచిపెట్టండి. అప్పుడు మీరు చెప్పనవసరం లేకుండానే అట్టి స్త్రీ పురుషులు వర్ణాంతర భోజనాలు చేస్తారు. వర్ణాంతర వివాహాలూ చేసుకొంటారు."

# 7. విశాలత్వమే కుల నిర్మూలనకు నాంది

– **అరసవిల్లి కృష్ణ,** అధ్యక్షులు, విరసం, విజయవాడ.

భారత సమాజంలో అనువంశికంగా కుల వ్యవస్థ కొనసాగుతుంది. కులం పుట్టుక, అది భావజాలంగా కొనసాగుతున్న విధానం, అనాదిగా భారత సమాజం కులం పునాదిపై మరింతగా సమీకృతమవుతున్నది. కులం ఉత్పత్తి సంబంధాల చట్రంలో నుండి నిర్మితమైనప్పుడు ఆ సంబంధాలు ఉత్పత్తి విధానం మారినప్పుడు కులం తన ఉనికిని కోల్పోవలసిన స్థితి వున్నది. భారత సమాజం చాలా దశలను దాటి వచ్చింది. కులం దగ్గర స్థిరీకరించబడింది. ఈ దశను అంచనా వేస్తే కుల నిర్మూలనకు దారి దొరుకుతుంది. వర్ణ వ్యవస్థ సైద్ధాంతిక పునాదిగా కులం లేదా మతం పునాది గా కులం మరింత బలపడింది అనే వాస్తవాన్ని అంగీకరిస్తే మరింత లోతుగా రక్తసంబంధాల కలయికలో కులం ఆధిపత్య భావనతో పని చేస్తున్నది అనేది అవగతమవుతుంది. చర్చలోకి పోగలిగితే కులం ఉపరితల అంశమే అయినప్పటికీ దాని రూపాన్ని భౌతిక, బ్రాహ్మణీయ భూస్వామ్య సమాజంలో నుండి, అంచనా వేయాలి. మనుషులు లేదా మానవ సంబంధాలు విశాలంగా ఐక్యత కావాల్సిన చోట లేదా భూస్వామ్య స్థానే పెట్టుబడి సంబంధాలు ప్రచలితమవు తున్నాయనే వాదన వినబడుతున్న సందర్భంలో కులం ఎంతో కొంతమేర బలహీనపడాలి. మారుతున్న కాలం నూతన పని విధానంలో వున్న యువతరం కులం పునాదిని ధ్వంసం చేయాల్సిన కాలయవనికలో మరింతగా కులం వారి హృదయాల లోపలికి ఎట్లా  ప్రవేశిస్తున్నది?

భారతీయ సమాజం వర్గ, కుల సమాజం. ఆర్థిక, సామాజిక అసమానతలు వర్గం కులం దగ్గర ముడిపడి వున్నాయి. వర్గం పరిష్కరించబడితే కులం సమస్య పరిష్కారమవుతుంది అనే భౌతిక వాదులు వున్నారు. వర్గం అంతరించిన కులం బలంగా వుంటుందనే కుల నిర్మూలన కోరుకునే వారున్నారు. ఇందులో సంక్లిష్టత లేదు. ఎవరి ప్రాపంచిక దృక్పథం వారిది. అయితే సమస్య ఎక్కడ వుంది. సమాజం విశాలత్వం చెందడంలో కుల పరిష్కార మార్గమున్నది. భారతీయ కుటుంబ వ్యవస్థ దాని బలం ఇంకాస్త ముందుకు వెళితే రక్త సంబంధాలలో వుండే రసాయనిక చర్య కుల సంబంధాలను సజీవంగా వుంచుతుంది. మానవ సంబంధాలలో ఇదొక మేలిమి ఒక బలహీనత కూడా. సైద్ధాంతిక నమూనాలో కుల అంచనా వేరు.

ఇక్కడ అంతర్వివాహ పద్దతి లో భారతీయ సమాజపు సంప్రదాయత ఇమిడి వున్నప్పుడు ఈ వివాహ పద్ధతి నుండి బయటపడి వివాహ సంబంధాలు ప్రజాస్వామికీకరణ దశలోకి ప్రవేశించ గలిగితే కులం పాత్ర కనుమరుగవుతుంది. అయితే అత్యంత బలమైన కుటుంబ వ్యవస్థలో రక్త సంబంధాలపై నిర్మితమైన కుటుంబ వ్యవస్థలో అంతర్వివాహ పద్ధతిని దాటి భారతీయ సమాజం ముందుకు వెళ్ళగలుగుతుందా? ఇది మౌలిక మైన ప్రశ్న. అయితే ఎంతో కొంత మేర కుటుంబ వ్యవస్థలోకి వచ్చిన ప్రేమ వివాహాల పద్దతి కులం పునాదిని ధ్వంసం చేయగలుగు తుందనే నమ్మిక ఏర్పడినా ఆచరణలో గుణాత్మక రూపం సంతరించుకోలేదు. కుటుంబం నుండి విశాల భావాలతో విడివడి కులాంతర వివాహాల వైపు మొగ్గు చూపిన యువతరం ఈ క్రమాన్ని విస్తరించడంలో లేదా ఆమోదం పొందడంలో సఫలం కాలేదు. ఇవాల్టికి పరువు హత్యల పరంపర కొనసాగుతుంది.కులం అనే సామాజిక హోదా అంతరించాల్సిన సమయంలో అది మరింతగా బలపడుతున్నది. కులం పుట్టుక దాని పెరుగుదల అసమానతలు కలిగిన మానవ సమాజాన్ని సూచిస్తుంది.

కాలం మారుతున్న కొలది మానవ అభిరుచులు చలనం చెందుతున్నాయి. మానవ జీవితంలోకి కొత్త అంశాలు నూతన పరికరాలు ప్రవేశిస్తున్నాయి. విశాలత్వం నూతన ఆవిష్కరణలు చేర్పు అవుతున్నాయి. మరోవైపు బ్రాహ్మణీయ భావజాలం పునాదిగా ఏర్పడిన మతం దాని కొనసాగింపుగా కులం ఒక ఆధిపత్య భావనలోకి మరింతగా భారతీయ సమాజం చొరబడుతున్న కాలమిది. ఇలాంటి సమయంలో కులనిర్మూలనకు వర్తమాన సమాజం దగ్గర లేదా ఆలోచనా పరుల దగ్గర ఎలాంటి పరికరాలు వున్నాయి. కులం అనే భావనను ధ్వంసం చేసే ప్రక్రియలో ఏ నమూనాను అనుసరించాలి అన్నది ఆలోచనాపరుల ముందున్న ప్రశ్న.

వ్యవస్థలో ఒక కులం తన స్థానమేదో గ్రహించడానికి వర్ణమనేది సాంస్కృతికంగా అవసరమైన తాళం చెవి వంటిది. అయితే ఒక పరిపూర్ణమైన వర్గీకరణ శాస్త్రం లో సరియైన వర్గిక (taxon) పరి పూర్తి చేయవలసిన షరతులను వర్ణం పూర్తి చేయదు అంటాడు వర్ణం నుండి కులం దాకా అనే సిద్ధాంత గ్రంథంలో యలవర్తి నవీన్‌బాబు. అయితే ఈ తాళం చెవి కులం స్థాయిని గ్రహించడానికి దాని తలుపులు తెరవడానికి అందుబాటులోనే వుంది. ఆ పని ఎవరు చేయాలి.

మొత్తం భారతీయ సామాజిక వ్యవస్థ ఆపనికి పూనుకోవాలి. కుల సంస్కృతికి దీటైన ప్రత్నామ్నాయ సాంస్కృతిక రూపాలు సమాజం స్వీకరించగలగాలి.

ఆర్థిక అసమానతలు లేని నూత్న సమాజం రూపొందే క్రమంలో కులం నిర్వహించిన భూమిక అదృశ్యమవుతుంది. ఆర్థికం అన్నింటినీ సమం చేస్తుంది అనేది వాస్తవం అయినప్పటికీ దానికి సమాంతరంగా సాంస్కృతిక రూపాలు వాటి పని విధానం మరింత వేగవంతం కావాలి. సమాజం మానవీకరించబడటం మాత్రమే కాదు, కులం పునాదిపై నిలబడిన భారతీయ సమాజం దాని అనుభవం మన ముందున్నది. కులం ఎంతగా అమానవీయ భూమికను నిర్వహిస్తున్నదీ అవగతమవుతున్నది.

కులం నిర్వహించిన సాంస్కృతిక దాడిని మార్చడం ఎట్లా అన్నదే మౌలికమైన భావధారగా మన ముందుండాలి. కాలంతో పాటు కులం తన రూపాన్ని మార్చుకుంటుంది. కులం సాంస్కృతిక అంశాలను మార్చుకుంటూ వస్తున్నది. ఆ మార్పు కులరహిత సమాజంగా రూపొందే క్రమానికి ఎలాంటి దోహదకారిగా వుంది అనేది, ప్రధానమయిన అంశం. యువతరంలోని ఆకాంక్షలు కుల నిర్మూలన వైపు మొగ్గుచూపితే కొంత మేరకు కులనిర్మూలన సాధ్యమైన అంశంగా ముందుకు వస్తుంది. కుల నిర్మూలన సామాజికపరమైన అంశమే కాదు. వర్గ దృష్టితో అంచనా వేయాల్సి వుంటుంది.

అంబేద్కర్ అన్నట్లుగా ఆధునిక విద్య, ఉపాధి రంగాల్లో ప్రతిభ, కులం వలస పాలకుల చేతిలో రంగులు మారుస్తూ కింది కులాలకు అవకాశాలు లేకుండా చేశాయి. పైకి దళితులకు అనుకూలంగా మాట్లాడినట్లు కనపించినా, సారాంశంలో కులతత్వం ఈ దేశంలో మరింతగా వేళ్ళూనుకునేట్టు బ్రిటిష్ పాలకనీతి గురించి చెప్పినట్లుగా అధికార మార్పిడి జరిగినా ఈ దేశ పాలక వర్గాల దగ్గర కుల నిర్మూలనకు సంబంధించిన అంశం వారి అజెండాలో లేకపోగా మరింతగా కులం నిర్వహించే పాత్రను విస్తరింప జేస్తున్నారు. ఈ నేపథ్యంలో కుల నిర్మూలన అంతిమంగా ప్రజల సాంస్కృతిక జీవితంలో ఓ భాగం కావాలి. కుల నిర్మూలనకు కావాల్సిన సామాజిక వాతావరణాన్ని అంతిమంగా ప్రజలే ఎత్తి పట్టాలి. ఆ వాతావరణాన్ని ఈ దేశపు మేధావివర్గం సృష్టించగలగాలి.

***

# 8. బ్రాహ్మణీయ పితృస్వామ్యం-సంస్కరణవాదం

– డా॥ చల్లపల్లి స్వరూపరాణి, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.

19వ శతాబ్దంలో ప్రారంభమైన సంఘసంస్కరణోద్యమం సమాంతరంగా రెండు భిన్న వర్గాల నాయకత్వం కింద సాగింది. పాశ్చాత్య విద్యద్వారా ప్రభావితమైన బ్రాహ్మణీయ వర్గాల మేధావులు ఒకవైపు తమ వర్గాల స్త్రీల సమస్యలైన సతీ సహగమనం, బాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యం వంటి సమస్యలపై సంస్కరణోద్యమం ప్రారంభిస్తే బ్రాహ్మణేతర వర్గాల మేధావులు సమాజంలోని స్త్రీలందరి సమస్యలతోపాటు యితర సామాజిక రుగ్మతలైన కులవివక్ష, అంటరానితనం, అవిద్య, వెట్టి చాకిరి, పేదరికం వంటి సమస్యలపైన కూడా ఒక సమగ్రమైన దృష్టితో దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో సామాజిక ఉద్యమాలు ప్రారంభించారు. అయితే, బ్రాహ్మణీయ సంస్కర్తలైన రాజారామమోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటివారు సంఖ్యాపరంగా సమాజంలో అతికొద్దిమందిగా వుండే బ్రాహ్మణ, క్షత్రియ కులాల స్త్రీల సమస్యల పరిష్కారం కోసం చేసిన ఉద్యమం ఈ దేశ సంఘ సంస్కరణోద్యమంగా ప్రాచుర్యం పొందింది. అంతేకాదు, అది చరిత్ర పుస్తకాలకెక్కి పాఠశాల స్థాయి నుంచి విశ్వవిద్యాలయ స్థాయి వరకు పాఠ్యాంశముగా మారడం వలన ఈ దేశంలో సంఘ సంస్కరణ అంటే పైవారే అని అందరి మెదళ్ళలో స్థిరపడిపోయింది. స్త్రీ సమస్యతోపాటు అన్ని సామాజిక రుగ్మతలపై దీర్ఘకాలిక ఉద్యమం చేసిన బ్రాహ్మణేతర సంస్కర్తలైన మహాత్మా జ్యోతిరావు ఫూలే. నారాయణగురు, అయ్యంకాళి, పెరియార్, అంబేడ్కర్ వంటివారి కృషి చాలాకాలం పాటు మరుగునపడిపోయింది. అయితే విదేశీ పరిశోధకులైన రోజ్లండ్ ఒహన్లాన్, గెయిల్ ఆమ్వెట్ట్, జెఫర్లట్, ఎల్లినార్ జెల్లియట్ వంటి వారి కృషివల్ల గత రెండు మూడు దశాబ్దాల నుంచి బ్రాహ్మణేతర మేధావుల సంస్కరణవాదం వెలుగులోకి వస్తుంది. వారి కృషికితోడు 1980, 90వ దశకాలలో దేశవ్యాప్తంగా పెల్లుబికిన దళిత ఉద్యమం, మండల్ కమిషన్ అనుకూల ఉద్యమం, అంబేడ్కర్‌కు భారతరత్నం అవార్డు ప్రకటించడం వంటి సందర్భాలవల్ల ఫూలే, అంబేడ్కర్ రచనలు వెలికితీయడం, అవి క్రమంగా ప్రాంతీయ భాషల్లోకి అనువాదం పొందడం వలన కూడా వారి ఉద్యమ స్వభావం తెలియవస్తుంది. వారు సమాజంలో పితృస్వామిక అణచివేత విధానాలతోపాటు బ్రాహ్మణవాదం, కులతత్వానికి తరతరాలుగా బలైపోయిన

వెనుకబడిన కులాలు, దళితులు, స్త్రీలు అంతా పీడితులేనన్న ఎరుకతో విశాలమైన ప్రాతిపదికన వారి విముక్తికోసం బలమైన కులవ్యతిరేక సామాజిక ఉద్యమాలు నిర్మించారు. ఆయా ఉద్యమాలను ముందుకు తీసుకెళ్ళడంలో తమ జీవితాలను ధారపోసిన బ్రాహ్మణేతర సంస్కర్తల కృషిపై యిప్పుడు దేశ విదేశాలలో విస్తృతంగా పరిశోధన జరుగుతుంది. రూపంలో, సారంలో బ్రాహ్మణ వర్గాల సంస్కరణ ఉద్యమానికి భిన్నంగా రూపొందిన ఆయా ఉద్యమాల తీరుతెన్నులపై అంతటా ఆసక్తికరమైన చర్చ జరుగుతుంది.

**పూలే సత్యశోధక సమాజం:**

మహాత్మాపూలే సత్యశోధక సమాజాన్ని తన మిత్రులు, తన జీవన సహచరి అయిన సావిత్రీబాయితో కల్సి ప్రారంభించి అణగారిన కులాలు, స్త్రీల విద్యకోసం, కుల నిర్మూలన కోసం బ్రాహ్మణవాదంపై ఆయన నడిపిన పోరాటాలన్నింటిలో సావిత్రీబాయిని క్రియాశీలక భాగస్వామిని చేశాడు. ఆగిపోయిన ఆమె చదువు కొనసాగించి టీచర్ ట్రైనింగ్ చేయించాడు. పూలే ప్రోత్సాహం, ఆమె స్వీయకృషితో సావిత్రీబాయి భారతదేశపు మొదటి మహిళా ఉపాధ్యాయిని అయ్యింది. ఇది స్త్రీ విముక్తిపరంగా మహాత్మాపూలే ఆచరణశీలతకు నిదర్శనం.

సత్యశోధక సమాజ కార్యక్రమాలలో సావిత్రీబాయితోపాటు సుమారు తొంభైమంది స్త్రీలు పాల్గొన్నారు. ఆమె సత్యశోధక సమాజ మహిళా విభాగానికి అధ్యక్షురాలు. పూలే మేనత్త 'సగుణాబాయి' మొదట్లో వారికి అన్ని విధాలుగా సహకారం అందించింది. సావిత్రీబాయితోపాటు పరమహంస మండలి సభ్యుడు భావల్కర్ దగ్గర టీచర్ ట్రైనింగ్ తీసుకున్న ముస్లిం మహిళ 'ఫాతిమా షేక్' కూడా వారితో కల్సి ఉద్యమంలో భాగస్వామి కావడమే కాక పూలే దంపతులు స్థాపించిన పాఠశాలలో సావిత్రీబాయితోపాటు టీచర్‌గా పనిచేసింది. ఆమె దేశంలో రెండవ మహిళా ఉపాధ్యాయిని. ఆ రోజుల్లో పూలే దంపతులు పూనేలో పాఠశాల ప్రారంభించినప్పుడు వారికి స్థలం ఇవ్వడానికి ఎవరూ ముందుకురాని పరిస్థితిలో ఫాతిమా షేక్ అన్న 'ఉస్మాన్ షేక్' భిడేవాడలోని తమ స్థలాన్ని వారికిచ్చి వారి వుద్యమానికి సహకరించారు. పూలే స్త్రీలు, అణగారిన కులాల విద్య కోసమే గాక వారిపై బ్రాహ్మణ పురుష పెత్తందార్లు సాగించే దాష్టీకాలపైన కూడా రాజీలేని పోరాటం చేశారు. బ్రాహ్మణ వితంతువులకు శిరోముండనం చేయించి వారిని నాలుగు గోడలకు పరిమితం చేసే ఆచారాన్ని విలక్షణ రీతిలో అడ్డుకున్నాడు. ఆ స్త్రీలకు శిరోముండనం

చేసే మంగలి వృత్తి వారితో ఆ పని చెయ్యకుండా నిరసన ప్రదర్శన చేయించడం విశేషం. దీనికి ఫూలే ఉద్యమ సహచరుడు, భారత కార్మికోద్యమ పితామహుడు నారాయణ మేఘాజీ లొఖాండే నాయకత్వం వహించాడు. ఫూలే కులాంతర, మతాంతర వివాహాలను ప్రోత్సహించడమే కాకుండా బ్రాహ్మణ పురోహితుడిని పిలవకుండా హిందూ సాంప్రదాయానికి ప్రత్యామ్నాయ వివాహ పద్ధతిని ప్రారంభించి మనువాదులకు గుండెల్లో గుబులు పుట్టించాడు. ఆయన అణగారిన కులాల స్త్రీలు గ్రామదేవతల పూజా విధానంలో దేవుడికి అంకితమిచ్చే జోగినులుగా చెయ్యబడి హిందువుల శవయాత్రల ముందు, ఊరేగింపుల ముందు 'తమాషా' అనే పేరున నాట్యం చెయ్యడాన్ని అడ్డుకున్నాడు. ఆ దురాచారం నుండి బైటపడి ఆత్మగౌరవం పొందమని, దానికి చదువే పరిష్కారమని సూచించాడు. ఆయన హిందూమతానికి భిన్నంగా దేవుడు అనే భావనతో నిమిత్తం లేకుండా సమతకు పెద్దపీటవేసే బౌద్ధం వంటి ఒక మానవ మత విధానాన్ని ప్రారంభించాలని భావించాడు. అయితే అది నెరవేరలేదు.

బ్రాహ్మణ వితంతువులు యితర పురుషుల వల్ల గర్భం దాల్చితే అది వారికి మరణ యాతనతో సమానంగా వుండేది. గత్యంతరం లేని స్థితిలో ఆ స్త్రీలు కాశీవంటి పుణ్యక్షేత్రాలకు వెళ్లి అక్కడే బిడ్డని కని పారేసి రావడమో లేక తామే ఆత్మహత్యకు పాల్పడడమో జరిగేది. అటువంటి స్త్రీలకోసం ఫూలే దంపతులు కాశీలో 'శిశు హత్యా నిరోధక గృహం' అనే పేరున ఒక సంరక్షణాలయాన్ని ఏర్పాటుచేసి వారికి ఆశ్రయం కల్పించారు. ఆ వితంతు స్త్రీల సంతానానికి తామే తల్లిదండ్రులై సాకారు. 'కాశీబాయి' అనే వితంతువు కన్నబిడ్డను తమబిడ్డగా పెంచి పెద్దచేశారు. అతడే డా. యశ్వంతరావు. యశ్వంతరావు ఫూలే మరణానంతరం సావిత్రీబాయికి తోడుగా సత్యశోధక సమాజ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళడంలో సహకరించాడు.

**సావిత్రీబాయి ఫూలే:**

సావిత్రీబాయి కేవలం ఫూలే భార్యగా కాక ఒక నిండైన వ్యక్తిత్వంలో విప్లవాత్మకంగా జీవించి భారతదేశపు మొట్టమొదటి మహిళా ఉపాధ్యాయినగా, సంఘ సంస్కర్తగా, గొప్ప ఆచరణవాదిగా చరిత్రలో నిలిచిపోయింది. ఆమె చిన్ననాటి నుంచీ స్వతంత్ర భావాలు కలిగి వుండేదని తెలుస్తుంది. అప్పటికి మహిళా ఉపాధ్యాయులు ఏ కులంలోనూ లేకపోవడం వల్ల సావిత్రీబాయి ఒక వెనుకబడిన 'మాలి' కులానికి చెందిన స్త్రీగా టీచర్‌గా పనిచేయడం, అందునా ఆడపిల్లలకు,

అణగారిన కులాలవారికి చదువు చెప్పడం బ్రాహ్మణ పూజారి పురుష పెత్తనదారులకు మింగుడుపడని విషయం అయ్యింది. వారామెను తన పని చేసుకోకుండా అనేక విధాలుగా అడ్డుకున్నారు. ఆమె వచ్చి వెళ్ళేదారిలో వెకిలి మాటలతో చేష్టలతో ఆమెని వేధించారు. ఆమె బట్టలమీద పేడనీళ్ళు, కోడిగుడ్లు విసిరారు. అయినప్పటికీ ఆమె వెనకాడకుండా తనతోపాటు మరొక చీర సంచీలో తీసుకెళ్ళి స్కూల్లో మార్చుకునేది. ఒకసారి వారామెమీద భౌతిక దాడికి దిగగా ఆమె ప్రతిదాడి చేసింది. ఊహించని ఆ పరిణామానికి బ్రాహ్మణ పెత్తనదారులు సిగ్గుతో పారిపోయారు. అనేకమంది అణగారిన పిల్లలను విద్యావంతులను చెయ్యడమే కాక దళితులకు సమాజం అంటరానితనం కారణంగా ఊరి బావుల్లో నీరు తోడుకోనియ్యకపోతే పూలే దంపతులు తమ ఇంటి బావిని ఇచ్చారు. కాశీలో అనాథ బ్రాహ్మణ వితంతువులు సమాజం దృష్టిలో 'అక్రమ సంతానం'గా భావించే తమ బిడ్డల్ని స్వయంగా వచ్చి ఇవ్వాలంటే ఆ స్త్రీలు అవమానంతో, భయంతో రాలేరని ఆమె ఆ ఇంటి ముందు ఒక వుయ్యాలని ఏర్పాటు చేసింది. తమను స్వయంగా కలవకపోయినా ఎవరైనా వచ్చి బిడ్డని ఆ వుయ్యాలలో వదిలి వెళ్ళవచ్చు అని బైట వాల్‌పోస్టర్లు కూడా అంటించారు. ఆ సందర్భంలో పూలే మీద బ్రాహ్మణ వర్గం నుంచి హత్యాప్రయత్నం కూడా జరిగింది. అయినప్పటికీ వారు దేనికీ బెదరలేదు.

సావిత్రీబాయి కేవలం స్త్రీవిద్య, ఇతర స్త్రీపరమైన సమస్యతోపాటు అనేక పేదరికం, అంటువ్యాధుల వంటి ఇతర సమస్యలపైన కూడా పనిచేసింది. అప్పట్లో తీవ్రమైన కరువు కాటకాలు ఏర్పడి ప్రజలు తిండిలేక అవస్థలు పడుతుంటే ఆమె జిల్లా కలెక్టర్‌ని కలిసి తిండి గింజలు ఇవ్వమని అడిగింది. ఆయన వెంటనే ఆమె అడిగినంత ధాన్యాన్ని పంపించాడు. పూనే పరిసర ప్రాంతాల్లో ప్లేగువ్యాధితో అనేకమంది పేదలు మరణిస్తున్నప్పుడు ఆమె తమ కుమారుడు యశ్వంతరావుతో కలిసి మురికివాడల్లో తిరిగి వారికి సేవచేసింది. ఆ క్రమంలోనే ఆమె వ్యాధి బారినపడి మరణించింది. తన ఉద్యమ కార్యాచరణలో సావిత్రీబాయి నిమగ్నతకు, నిబద్ధతకు ఆమె మరణించిన విధానమే నిదర్శనం.

**సత్యశోధక వారసత్వం:**

పూలే దంపతుల సత్యశోధక సమాజం ద్వారా బ్రాహ్మణ కులం నుంచి ఇతర అణగారిన కులాల వరకు అనేకమంది స్త్రీలు నాయకులుగా, మేధావులుగా, రచయితలుగా ఎదిగివచ్చారు. వారిలో 'మాతంగ' కులానికి చెందిన తారాబాయి షిండే, 'మాంగ్' కులానికి చెందిన ముక్తాబాయి, రామోషీ అనే సంచార జాతికి

చెందిన సావిత్రీబాయి రోడే, బ్రాహ్మణ కులానికి చెందిన పండిత రమాబాయి ముఖ్యులు. తారాబాయి షిండే సత్యశోధక సమాజపు ప్రారంభ సభ్యురాలు, ఫూలేకి సన్నిహితులు, ఆయన ఆమెని తన కుమార్తెలా భావించి ప్రోత్సహించేవాడు. తారాబాయి ఫూలే ఇచ్చిన స్ఫూర్తితో గొప్ప ఉద్యమకారిణిగా, రచయిత్రిగా గుర్తింపు పొందింది. ఆమె వితంతు స్త్రీలు, తప్పనిసరి పరిస్థితుల్లో వేశ్యావృత్తిలోకి నెట్టబడిన వారికోసం పనిచేసి శక్తివంతమైన రచనలు కూడా చేసింది. ఆమె రచనలు మరాఠీ భాషలో సంచలనం రేపాయి.

ముక్తాబాయి మాంగ్ కులానికి చెందిన బాలిక. ఈమె ఫూలే ప్రారంభించిన స్కూల్లో చదువుకుని రచయితగా గుర్తింపు పొందింది. బ్రాహ్మణవాద సాహిత్యాన్ని, భావజాలాన్ని తన వ్యాసంలో ఎత్తిచూపింది.

పండిత రమాబాయి బ్రాహ్మణ కులంలో పుట్టి సత్యశోధక కార్యక్రమాల పట్ల ఆకర్షితురాలైన వ్యక్తి. ఆమె క్రైస్తవ మిషనరీలు అందించిన పాశ్చాత్య విద్యతోపాటు క్రైస్తవ మతంలోకి కూడా మారింది. నిజానికి ఫూలే మతమార్పిడికి వ్యతిరేకం అయినప్పటికీ ఆమె నిర్ణయాన్ని గౌరవించాడు. మహారాష్ట్రకు చెందిన ఈమె బెంగాలీ వ్యక్తిని కులాంతర వివాహం చేసుకుంది. భర్త అకాల మరణం తరువాత ఆమె సంఘ సంస్కరణ ఉద్యమంలో క్రియాశీలకంగా పాల్గొంది.

**ఫూలే అనంతర సత్యశోధక సమాజం:**

ఫూలే దంపతులు బ్రాహ్మణ మేధావులు ప్రారంభించిన సంఘ సంస్కరణకు భిన్నంగా విశాలమైన ప్రాతిపదికన సంస్కరణ ఉద్యమాన్ని నిర్మించారు. ఆయన మరణానంతరం సత్యశోధక సమాజం ఎన్నో సవాళ్ళను ఎదుర్కొంది. అయినప్పటికీ రెండవ తరం సత్యశోధక సమాజ కార్యకర్తలైన లోఖాండే, బాబూరావు, భాస్కరరావు యాదవ్ వంటివారు బ్రాహ్మణవాదుల ఎత్తుగడలను తిప్పిగొట్టి ఫూలే దంపతుల స్ఫూర్తిని బ్రతికించారు. సత్యశోధక సమాజం రెండోతరం కార్యకర్తల్లో 'రామోషీ' అనే సంచార జాతికి చెందిన 'సావిత్రీబాయి రోడే' స్త్రీ విముక్తి పరంగా చేసిన కృషి చెప్పుకోదగినది. ఆమె ఫూలేపై హత్యాయత్నానికి బ్రాహ్మణవాదులు పంపిన రామోషీ తెగకు చెందిన 'నేరగాడు' 'దొండీరాం రోడే' కి కోడలు. దొండీరాం మనసు మార్చుకుని ఫూలే అనుచరుడు, వ్యక్తిగత రక్షకుడు అవ్వడమే కాక తన కుటుంబం కూడా సత్యశోధక సమాజం పనిలో భాగమయ్యింది. సావిత్రీబాయి రోడే సత్యశోధక సమాజం ప్రారంభించిన పాఠశాలలను నడిపిస్తూ అనేక ఇతర కార్యక్రమాలు కూడా

చేపట్టింది. బ్రాహ్మణవాదులకు పట్టుకొమ్మగా భావించే పూనే పరిసర ప్రాంతాల్లోఫూలే మరణానంతరం వారు తిలక్ నాయకత్వంలో తిరిగి మనువాదాన్ని అమలుపరచడం మొదలుపెట్టి అందులో భాగంగా పూనే మున్సిపాలిటీలో వుండే పాఠశాలల్లో ఆడపిల్లల ప్రవేశాలను అడ్డుకున్నారు. అప్పటివరకూ అందరికీ నిర్బంధ ఉచిత విద్య అందించాలనే ఉద్దేశ్యంతో నడిచిన విద్యా విధానానికి వారు గండికొట్టి ఆడపిల్లలు, అణగారిన కులాల విద్యార్థులను బడిలో చేరకుండా ఆటంకపరిస్తే సావిత్రీబాయి వారు తిరిగి స్కూల్లో చేరడానికి కృషి చేసింది. సావిత్రీబాయి రోడేతోపాటు గంగూబాయి, పుత్లాబాయి, మరికొందరు యూరోపియన్ స్త్రీలు కూడా ఆ కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నారు. సావిత్రీబాయి రోడే కృషికి గుర్తింపుగా ఆమెకి 'విద్యాదేవి' బిరుదునిచ్చి జనం గౌరవించారు. ఆమె సత్యశోధక సమాజం యాభై ఏళ్ళ ఉత్సవాన్ని కూడా నిర్వహించింది.

**బహుజన పాలకులు:**

మహాత్మా ఫూలే సత్యశోధక సమాజ కార్యక్రమాలతో సాధారణ వ్యక్తులే కాకుండా ఆనాటి సంస్థానాధీశులైన బరోడా మహారాజు శాయాజీరావు గైక్వాడ్, కొల్హాపూర్ రాజు ఛత్రపతి సాహూ మహారాజు, మైసూరు సంస్థానాధీశుడు కృష్ణస్వామి అడయారు వంటివారు కూడా ఆకర్షితులై తమ పాలనలో అణగారిన కులాలు, స్త్రీల పరంగా సంస్కరణలు చేపట్టారు. ముఖ్యంగా వారి విద్యాభివృద్ధికి పాటుపడుతూ అనేక విద్యాలయాలను స్థాపించారు. కుల మతతత్వానికి గురౌతూ జంతువులకంటే హీనంగా చూడబడే వారికి వారి సంస్కరణవాదం వలన ఎంతో మేలు జరిగిందని చెప్పాలి. సాహూ మహారాజు ఆడపిల్లల కోసం అనేక పాఠశాలలు, కళాశాలలు ప్రారంభించి, వారి చదువుని ప్రోత్సహించడమే కాక దేవదాసీ విధానాన్ని, బాల్య వివాహాలను రూపుమాపుతూ చట్టాలు చేశాడు. అప్పటి సంస్కర్తలు కొందరు వ్యభిచార నిరోధం పేరుతో స్త్రీలను వేదింపులకు గురిచేయడాన్ని తన చట్టంతో నిరోధించాడు. 1920 వ దశకం నాటికే విడాకుల చట్టం తీసుకొచ్చి సంప్రదాయ పితృస్వామ్యానికి వెన్నులో వణుకు పుట్టించాడు. అంతేకాదు తన భార్యని వివాహం తర్వాత చదివించాడు.

స్త్రీ విముక్తి పరంగా దక్షిణాదిలోని కేరళలో నారాయణగురు, అయ్యంకాళి, తమిళనాడు పెరియార్, తెలుగు రాష్ట్రాల్లో భాగ్యరెడ్డి వర్మవంటి బ్రాహ్మణేతర సంస్కర్తలు చేసిన కృషిపై కూడా పెద్దగా అధ్యయనాలు రాకపోవడం గమనార్హం.. దేవుడి

సొంత దేశంగా చెప్పబడే కేరళలో అణగారిన కులాల స్త్రీలపై దుర్మార్గమైన ఆచారాలు, అణచివేత రూపాలు ఉన్నాయంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. అక్కడ దళిత, వెనుకబడిన కులాల స్త్రీలు తమ వక్షాన్ని కప్పుకునే రవిక ధరించడానికి వీలులేదు. పైగా వారి వక్షస్థలంపై 'మూలంకారం' అనే పేరున పన్ను చెల్లించాలి అనేది ట్రావన్‌కోర్ సంస్థానంలో అమలయిన దుర్మార్గపు శాసనం. ఆ శాసనాన్ని ధిక్కరించి దానికి నిరసనగా 19వ శతాబ్దపు ప్రారంభ దినాల్లో 'నంగేళీ' అనే ఎజవా స్త్రీ తన రొమ్ములు కత్తితో కోసుకుని ఆత్మత్యాగం చెయ్యడం సమాజానికి అతిపెద్ద గగుర్పాటును కలిగించిందనవచ్చు. అటువంటి రాజశాసనాల మీదనే కాకుండా వారికి నిరాకరింపబడిన విద్య, సమానత్వపు హక్కులకోసం నారాయణగురు, అయ్యంకాళి పోరాడారు. నారాయణగురు తాను నిర్మించిన ప్రత్యామ్నాయ మత సంస్థల పరిధిలో స్త్రీలకోసం ప్రత్యేక పాఠశాలలు, వృత్తి విద్యాకేంద్రాలు స్థాపించాడు. అయ్యంకాళి మతానికి బైట విద్యాసంస్థల ఏర్పాటు కోసం కృషిచేసి అనేకమంది అణగారిన కులాలవారినీ, స్త్రీలనూ విద్యావంతులను చేశాడు. అణగారిన స్త్రీలకు గుండెల్ని కప్పుకునే రవికలతోపాటు గుండెనిండా పీల్చుకోడానికి కావాల్సిన ఆత్మస్థైర్యాన్ని కూడా ప్రోది చేశాడు.

తమిళనాడులో పెరియార్ ప్రారంభించిన ద్రావిడ ఉద్యమంలో స్త్రీ సమస్యని కూడా ఒక ప్రధాన ఎజెండాగా చేర్చి స్త్రీలకోసం విప్లవాత్మకమైన కార్యక్రమాలు చేపట్టారు. బ్రాహ్మణవాదం ఏ రూపంలో వున్నా దాన్ని ఎదుర్కొని సమాజం సమూలంగా మార్పు చెందాలని భావించాడు. స్త్రీని ఒకపక్క దేవతగా పూజించే హిందూమతం మరోపక్క ఆమెను దేవదాసిగా, వూరుమ్మడి వస్తువుగా దిగజార్చిందని హిందూమతం యొక్క రెండు నాల్కల ధోరణిని ఎండగట్టాడు. స్త్రీకి ఆస్తిహక్కు, గర్భనిరోధక హక్కు, జీవిత భాగస్వామిని ఎన్నుకొనే స్వేచ్ఛ ఉండాలని పెరియార్ వాదించాడు. వివాహ వ్యవస్థలో వున్న లొసుగులను చీల్చి చెండాడడమే గాకుండా వ్యక్తిత్వాలను గౌరవించే పెళ్ళిళ్లు జరగాలని ప్రతిపాదించాడు. తాళిబొట్టు, కట్నకానుకలు, కులమతాలకు సంబంధం లేని వివాహాలను ఆయనే స్వయంగా జరిపించాడు. భూమి ఒక ఆస్తిగా భావించని కాలంలో దానిపై ప్రజలకు హక్కులు లేని కాలంలో స్త్రీలపైన అణచివేత, బానిసత్వం, బలవంతపు వివాహాలు లేవని ఆయన అభిప్రాయం. స్త్రీలు, కుటుంబం, కులం వంటి అంశాలతో పెరియార్ ఆలోచనలు ఎంగెల్స్, అంబేద్కర్ ఆలోచనలకు దగ్గరగానూ, ఆయన బ్రాహ్మణేతర

భావాలు ఫూలే భావాలకు దగ్గరగానూ అనిపిస్తాయి. ఆనాటి స్త్రీవిద్య, స్త్రీలను మంచి వంటగత్తెలుగనూ, గృహిణులుగానూ, సంగీత కళాకారిణులు గానూ, కుట్టుపనులు నేర్పే వారిగానూ వెరసి 'మంచిభర్త' కోసం ఏర్పాటు చేయబడినట్లుగా ఉందని పెరియార్ వ్యంగ్యంగా పేర్కొనడం విశేషం. ఆయన మాటలు ఈనాటికి కూడా వర్తిస్తాయి.

హైదరాబాద్ రాష్ట్రంలో భాగ్యరెడ్డివర్మ ప్రారంభించిన ఆది హిందూ, ఆది ఆంధ్ర ఉద్యమాలలో కూడా స్త్రీ విముక్తి ఒక ప్రధాన అంశంగా వుంది. భాగ్యరెడ్డి మొదట దళిత సమాజంలో అంతర్గత సంస్కరణలు తీసుకొచ్చినపుడు దళిత పురుషులు తాగుడు, ఇతర వ్యసనాల నుంచి బైట పడాలని, అందరూ చదువుకోవాలని సూచిస్తూ అనేక పాటశాలలు స్థాపించాడు. ముఖ్యంగా హైదరాబాద్ చుట్టుపక్కల ఆయన స్థాపించిన పాఠశాలల్లో అనేకమంది దళితులూ, స్త్రీలు చదువుకుని తమ జీవితాలను మార్చుకున్నారు. షూస్ మండిలో అణగారిన కులాల కోసం స్కూలు స్థాపించిన కట్టరామక్క అనే దళిత స్త్రీ భాగ్యరెడ్డి ఉద్యమ ప్రభావం వలననే ఆ పని చెయ్యగలిగింది. తర్వాత కాలంలో ఉద్యమకారిణిగా, రాజకీయ నాయకురాలిగా ముందుకొచ్చిన జే. ఈవ్వరీబాయి భాగ్యరెడ్డి స్థాపించిన విద్యాలయాలలో చదువుకుని చైతన్యం పొందడం తిరిగి పేదల అభ్యున్నతి కోసం పనిచెయ్యడం విశేషం. భాగ్యరెడ్డి వుద్యమానికి మూడవ తరంలో నాయకురాలిగా ఎదిగి వచ్చిన దళిత ఉద్యమకారిణి సదాలక్ష్మి కూడా భాగ్యరెడ్డి స్థాపించిన విద్యాలయాలలో చదువుకుని ఆయన ఉద్యమ స్ఫూర్తిని అందిపుచ్చుకున్న మహిళ. ఆయన ఒకవైపు అణగారిన కులాలకు, ఆడపిల్లలకు విద్యావకాశాలను కల్పిస్తూనే మరొకవైపు దళిత స్త్రీల పరంగా 'మురళి' పేరుతో అమలయ్యే లైంగిక దోపిడీని నిర్మూలించడానికి కృషి చేశాడు. గ్రామాల నుంచి ఇంటిపని కోసం హైదరాబాదు నగరానికి వచ్చే స్త్రీల హక్కుల కోసం 'డొమెస్టిక్ వర్కర్స్ యూనియన్'ని ఏర్పాటుచేసి వారిని సంఘటిత పరిచాడు.

**అంబేద్కర్ స్త్రీ విముక్తి :**

భారతదేశంలో స్త్రీల హక్కుల కోసం అంబేద్కర్ చేసిన కృషి చాలా విశిష్టమైనదని చెప్పాలి. ఆయన 1920 లలో మహద్ చెరువు నీటిమీద హక్కుకోసం, దేవాలయ ప్రవేశం కోసం ప్రజా ఉద్యమాలు నిర్మించిన దశ నుంచి స్త్రీలను ఉద్యమంలో భాగస్వాములను చేశాడు. ముఖ్యంగా దళిత స్త్రీలను ప్రోత్సహించి వారు సంఘటితమవ్వడానికి తోడ్పడ్డాడు. 1942 నాగపూర్‌లో దళిత మహిళా కాన్ఫరెన్సు

జరిగే నాటికి అంబేద్కర్ పర్యవేక్షణలో దళిత స్త్రీలు తమ హక్కుల సాధన కోసం అనేక పోరాటాలు చేశారు. వారు తమ బాలికలకు నిర్బంధ ఉచిత విద్యతోపాటు వారికి స్కాలర్‌షిప్పులు, హాస్టల్ వసతి సౌకర్యాలు కల్పించాలని, బాలికలకు సాధారణ విద్యతోపాటు వ్యాయామ విద్యని కూడా ఒక ముఖ్యాంశంగా అందించాలని, వారి వ్యక్తిగత భద్రతకోసం మూడు అంగుళాల కత్తిని తమ జుట్టులో ధరించే అనుమతి కల్పించాలని 1930వ దశకంలోనే దళిత మహిళా ఉద్యమకారులు ప్రభుత్వాన్ని డిమాండ్ చెయ్యడం ఆ ఉద్యమ తీరులోని తీవ్రతకు తార్కాణం. ఇంకా బాలికల వివాహ వయసును పెంచాలని వారు కనీసం పాఠశాల విద్య పూర్తయ్యేవరకు వివాహం చేసుకునే పరిస్థితి లేకుండా వారి వయసును నిర్ణయించాలని బ్రిటీష్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. షెడ్యూలు కులాల స్త్రీలకు ప్రభుత్వోద్యోగాలలో రిజర్వేషన్లతోపాటు స్థానిక జిల్లా, మున్సిపల్ బోర్డులలో ప్రాతినిధ్యం కల్పించాలని ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మిక మహిళలకు పురుషులతోపాటు సమానంగా వేతనాలు కల్పించి వారి పనిగంటలు తగ్గించి కొంత విశ్రాంతి సమయాన్ని కేటాయించాలని, జీతభత్యాలతో ప్రసూతి సెలవు మంజూరు చెయ్యాలని, ఫ్యాక్టరీలలో పరిశుభ్రమైన వాతావరణంతోపాటు స్త్రీలకు ప్రత్యేకంగా మరుగుదొడ్లు నిర్మించాలని యాజమాన్యానికి అర్జీలు పెట్టారు. అలాగే స్త్రీలు వరుసగా గర్భం దాల్చడం, వరుస కాన్పులవల్ల అనారోగ్యంపాలు కాకుండా వారికి కుటుంబ నియంత్రణను అమలు చెయ్యాలని, బహుభార్యత్వాన్ని అధికారికంగా రద్దుచేసి భార్య బతికివుండగా మరొకరితో వివాహ సంబంధంలోకి వెళ్ళే పురుషులపైన, మద్యపానానికి బానిసలై భార్యాబిడ్డల్ని నిర్లక్ష్యం చేసే భర్తలపైన కఠిన చర్యలు తీసుకోవాలని దళిత స్త్రీలు ప్రభుత్వాన్ని కోరారు.

1942లో నాగపూర్‌లో జరిగిన ఆలిండియా దళిత మహిళా కాన్ఫరెన్సుకు అంబేద్కర్ ముఖ్య అతిథిగా హాజరై తనకు మహిళా శక్తిపైన నమ్మకం వుందని తాను ఒక దేశపు ప్రగతిని ఆ దేశంలో స్త్రీలు సాధించిన ప్రగతిని బట్టే అంచనా వేస్తానని అన్నారు. ఈ సభలోనే ఆయన జోగినీ స్త్రీలనుద్దేశించి మాట్లాడుతూ 'ఏ హిందూమతం తమని ఊరుమ్మడి వస్తువుగా దిగజార్చిందో ఆ మతాన్ని వదిలి సమతకు ప్రాతిపదికగా వుండే మానవమతం బౌద్ధంలోకి రావాలని ఆ స్త్రీలకు పిలుపునిచ్చాడు. నాగపూర్ సభకు దేశవ్యాప్తంగా సుమారు 25000 మంది దళిత

స్త్రీలు వివిధ ప్రాంతాల నుంచి హాజరవ్వడం ఆనాటికి ఎంతో విప్లవాత్మకం అనుకోవచ్చు. సులోచనాబాయి కాంబ్లే సభకు అధ్యక్షురాలిగా వ్యవహరించగా అంబేద్కర్ ముఖ్య అతిధిగా పాల్గొని దళిత స్త్రీల పోరాటానికి సంఘీభావం వ్యక్తం చేశాడు.

అంబేద్కర్ ప్రజా ఉద్యమంలో స్త్రీలను ఎక్కువగా కలుపుకోవడమే కాక దళిత సమాజంలో అందర్గత సంస్కరణలు చేపట్టి అవి స్త్రీల చొరవతో జరిగేలా ప్రోత్సహించాడు. వారు పరిశుభ్రంగా ఉంటూ, తమకుండే పాతబట్టలైనా శుభ్రంగా ఉతుక్కుని ధరించాలని, చౌకబారు అలంకరణలు చేసుకోకుండా హుందాగా వుండాలని, చచ్చిన గొడ్డుమాంసం తినడాన్ని మద్యం సేవించడాన్ని మానెయ్యాలని, గ్రామాలలో మూఢాచారాలను వదిలేసి ప్రతిఒక్కరూ తమ పిల్లలను స్కూలుకు పంపాలని ఆయన కోరినప్పుడు దళిత పురుషులకంటే స్త్రీలే సానుకూలంగా స్పందించి అంబేద్కర్ చేసిన సూచనలను పాటించారు. కొందరు దళిత పురుషులు చచ్చిన గొడ్డుమాంసం తమకి పై కులాల నుంచి వచ్చే ఒకానొక వనరుగా, హక్కుగా భావించి అది తినకపోతే ఇతర వనరులు లేని పేదవారైన తాము చచ్చిపోతామని అంబేద్కర్‌కు తీవ్రంగా బదులిచ్చారు. అందుకు ఆయన కూడా అంతే తీవ్రంగా స్పందిస్తూ తిండిలేక ఒక తరం వారు చచ్చిపోయినా, తర్వాతివారు ఆత్మగౌరవంతో బతుకుతారని, ఆత్మగౌరవం కంటే ఏదీ ముఖ్యం కాదని చెప్పినప్పుడు దళిత స్త్రీలు ఆయనవైపు నిలిచారు. అంబేద్కర్ పిలుపునందుకుని దళిత స్త్రీలు తమ బిడ్డలను స్కూలుకు పంపించారు, పరిశుభ్రత పాటించారు, ఆహారం విషయంలో మూఢత్వాన్ని వదిలేశారు. దీనితో మహారాష్ట్రలోని మహర్ సమాజంలో చెప్పుకోదగిన స్థాయిలో అభివృద్ధి జరిగింది. దళిత యువత విద్యావంతులై ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రవేశించి తమ ఆత్మగౌరవాన్ని చాటారు. ఇదంతా దళిత స్త్రీల చొరవవల్లనే సాధ్యపడిందని చెప్పాలి. అంబేద్కర్ 1956లో బౌద్ధదీక్ష తీసుకునే సందర్భంలో కూడా అనేకమంది స్త్రీలు పెద్దయెత్తున నాగపూర్ బౌద్ధ దీక్షలో పాల్గొని వారుకూడా ఆయన చేతుల మీదుగా బౌద్ధంలోకి మతం మారారు.

వివాహం, బిడ్డల పెంపకం వంటి విషయాలలో అంబేద్కర్‌కు విశాలమైన దృష్టి వుంది. భార్యాభర్తల మధ్య అధికారిక సంబంధాలకంటే స్నేహపూర్వకమైన అనుబంధం వుండాలని ఒకరి అభిప్రాయాలను మరొకరు గౌరవించుకోవాలని వివాహ సంబంధం గురించి అంబేద్కర్ అంటాడు. స్త్రీలకు తమ జీవిత భాగస్వామిని

ఎన్నుకునే విషయం నుంచి ఎంతమంది పిల్లలను కనాలో, ఎప్పుడు కనాలో నిర్ణయించుకునే వ్యక్తిగత స్వేచ్ఛ అవసరమని ఆయన భావిస్తాడు. అధిక సంతానం వల్ల స్త్రీ ఆరోగ్యం పతనమవ్వడం గురించి ఆయన తన కుటుంబం పరిస్థితినే ఉదాహరణగా పేర్కొంటాడు. ఆయన తన భార్య రమాబాయిని ఎంతో అభిమానించాడు. ఆయన చదువుకుంటూ, ఉద్యమాలలో తిరుగుతూ కుటుంబాన్ని నిర్లక్ష్యం చేస్తున్నప్పుడు ఆమె కుటుంబ పోషణ కోసం శ్రమ పడిందని, ఆమె కోసం తానేమీ చెయ్యలేకపోయానని వ్యథ చెందేవాడు.

అంబేద్కర్ స్త్రీలపరంగా చేపట్టిన కార్యక్రమాలలో హిందూకోడ్ బిల్లు ఆయన స్వతంత్ర భారత్‌లో తొలి న్యాయశాఖ మంత్రిగా వున్నపుడు పార్లమెంటులో ప్రవేశపెట్టడం కీలకమైనది. స్త్రీలకు ఆస్తిహక్కు, దత్తత స్వీకారం విషయంలో స్త్రీపాత్ర, ఇష్టంలేని భర్త నుంచి విడాకులు పొందే హక్కు వంటి స్త్రీస్వేచ్ఛకు సంబంధించిన అంశాలలో పొందుపరిచిన హిందూకోడ్ బిల్లును బ్రాహ్మణవాద నాయకులు ఎక్కువగా వున్న లోక్‌సభలో ప్రవేశపెట్టడం సంప్రదాయి వాదానికి సవాల్ విసరడమే అనుకోవచ్చు. హిందూకోడ్ బిల్లులోని అంశాలన్నీ హిందూ వివాహ వ్యవస్థకు గొడ్డలిపెట్టని భావించిన సర్దార్ వల్లభాయి పటేల్, రాజేంద్రప్రసాద్ వంటి నాయకులు ఆ బిల్లు పాస్ కాకుండా ప్రధాని జవహర్లాల్ నెహ్రూపై వత్తిడి తెచ్చారు. నిజానికి ఈ బిల్లులోని అంశాల వల్ల లబ్ది పొందేది ఆస్తి, అంతస్తు. కుటుంబం అన్నీ అమరిన ధనిక మధ్యతరగతి స్త్రీలే! సహజంగానే వారు ఆధిపత్య కులాల స్త్రీలై వుంటారు. అయితే హిందూ సనాతనవాదులు ఏ హిందూ స్త్రీల హక్కులకోసం ఈ బిల్లు వుద్దేశించబడినదో అదే వర్గం స్త్రీలను సమీకరించి ఈ బిల్లు తమకు అక్కర్లేదని ఢిల్లీ వీధుల్లో ధర్నా చేయించడం అంబేద్కర్ని బాగా బాధించింది. ముఖ్యాంశాలను తొలగించి ఒక కళేబరం వంటి ముసాయిదాను అంగీకరించడంతో అంబేద్కర్ తీవ్ర మనస్థాపానికి గురై తన మంత్రి పదవికి రాజీనామా చెయ్యడం అనేది స్త్రీ హక్కుల సాధనలో అంబేద్కర్ నిబద్ధతకు నిదర్శనం. ఆయన తన రాజీనామా లేఖలో 'the bill is unwept, unsung and buried' అని పేర్కొనడం ఆయన దాని గురించి పడిన వేదనకు గుర్తు.

అంబేద్కర్ ప్రారంభించిన కుల నిర్మూలనా ఉద్యమం వలన ఎందరో స్త్రీలు ప్రభావితమయ్యారు. ఆయన మరణానంతరం కూడా వారు ఆయన ఉద్యమ స్ఫూర్తిని ముందుకు తీసుకెళ్ళారు. వారంతా ఒకవైపు కులవివక్షకు వ్యతిరేకంగా పోరాటం

చేస్తూనే కుటుంబాలలో, సమాజంలో పితృస్వామిక విలువలు, అణచివేత విధానాలపై కూడా తమదైన స్వరాన్ని వినిపించారు. అంబేద్కర్ అనంతర దళిత ఉద్యమంలో అనేకమంది స్త్రీలు రచయితలుగా, ఆలోచనాపరులుగా రూపొందడం గమనార్హం. బేబీ కాంబ్లే, ఊర్మిళా పవార్, కుముద్ పవాడే, ప్రజ్ఞా లోఖాండే, జ్యోతీ లాంజెవార్ మొదలైన దళిత స్త్రీలు సాహిత్యంలో కూడా తమదైన ముద్ర వేశారు. వారి జీవితంలో, ఉద్యమంలో, సాహిత్యంలో అంబేద్కర్ కలిసిపోయి వుండడం గమనిస్తాం. బేబి కాంబ్లే, ఊర్మిలా పవార్‌ల ఆత్మకథలు వారి జీవితంలో అంబేద్కర్ పాత్ర ఏమిటో స్పష్టం చేశాయి.

సంఘ సంస్కరణ ఉద్యమంగా పాఠ్య పుస్తకాలకెక్కిన ఉద్యమం ఈ దేశానికి సంబంధించిన అందరు పీడితుల సమస్యలను ప్రతిబింబించలేదు. ముఖ్యంగా వారి దృష్టి కేవలం సుమారు ఐదు శాతానికి చెందిన బ్రాహ్మణ, క్షత్రియ కులాల స్త్రీల సమస్యలపైనే వుంది. సంఖ్యాపరంగా అత్యధిక శాతంగా ఉన్న పీడిత కులాల స్త్రీలు ఆ రోజుల్లో పేదరికం, వెట్టి చాకిరీ, జోగినీ, బసివివంటి ఆచారాల మురికికూపంలో లైంగిక దోపిడీకి గురికావడం, అంటరానితనం, అవిద్యవంటి సమస్యలతో కనీసపు మానవ హక్కులు వర్తించని పరిస్థితిలో వున్నారు. బ్రాహ్మణేతర కులాల నుంచి వచ్చిన సంస్కర్తలైన మహాత్మాజ్యోతీరావు ఫూలే నుంచి అంబేద్కర్ వరకు స్త్రీ సమస్యని సమాజంలోని ఇతర రుగ్మతలతోపాటు పరిష్కరించడానికి కృషి చేశారు. సమాజంలో కుల సమస్యతోపాటు లింగ వివక్ష కూడా ఒక ప్రధానమైన సమస్యగా వారు గుర్తించి పరిష్కార మార్గాలను అన్వేషించారు. స్త్రీ విముక్తి విషయంలో బ్రాహ్మణ వర్గాల మేధావుల దృష్టికోణానికీ, బ్రాహ్మణేతర మేధావుల దృష్టికీ స్పష్టమైన బేధం కనిపిస్తుంది. బ్రాహ్మణేతర సంస్కరణవాదం విశాలమైన ప్రాతిపదికన సాగింది. ఈ దేశంలో పితృస్వామ్యం 'బ్రాహ్మణీయ పితృస్వామ్యం' అనే అవగాహన వారి ఉద్యమ స్వభావంలో కనిపిస్తుంది.

***

# 9. కుల నిర్మూలన ఎలా?

**– కైల శ్రీనాథుడు,** అంబేడ్కరిస్ట్, పర్ణశాల.

భారత దేశం ఒక గొప్ప సాంస్కృతిక దేశంగా ప్రతి భారతీయుడు గర్వంగా చెప్పుకొచ్చారు. ఈ విషయంలో అందరూ తమ హావభావాలతో ఇది అఖండ సత్యం గాను ప్రచారం చేస్తారు. కానీ భారతదేశం కుల సమస్య విషయంలో గొప్ప వెనుకబాటుకు గురి అయినది. ఇది మనముందు సజీవ సాక్ష్యం. స్వతంత్ర భారత దేశంలో నేడు అంటరానివారు ప్రపంచంలో ఎక్కడలేని అరాచకాలు ఎదుర్కొంటు కనీస న్యాయం కోసం పోరాడుతున్నారు. పాలక వర్గాలు మోసపూరిత మార్గాలతో అధికారాన్ని హస్తగతం చేసుకొని బడుగు బలహీన వర్గాలకు తీరని అన్యాయం చేస్తున్నాయి.

డా॥ అంబేడ్కర్ కులనిర్మూలన పద్ధతులు రాజ్యాంగం అనుసరించక పోవడంవల్ల సమస్య జఠిలంగా మారింది. కులాంతర వివాహాలు కొన్ని జరిగినా అవి చాలా తక్కువ. వాటిలోకూడా కుల సమస్య ఉత్పన్నమై కుటుంబాల విచ్ఛిత్తికి దారి తీసింది. సమాజంలో వుండే కులసమస్య కుటుంబంలోకి ప్రసరించి పతనానికి దారితీసింది.

ఈ సందర్భంలో అంబెడ్కర్ హెచ్చరిక గుర్తుకొస్తుంది. ఇప్పుడు కులం భారతదేశ సమస్య కానీ భవిష్యత్తులో కులసమస్య ప్రపంచ సమస్య. ఇది నిజం. ఈ రోజు అమెరికా, బ్రిటన్ లో కేసులు నమోదవుతున్నాయి.

స్తంభించిన భారతసమాజం సాంఘిక సంస్కారాలు అమలులో ఘోరంగా విఫలమైంది. రాజ్యాంగ స్ఫూర్తిని అర్థం చేసుకుని సమాజాన్ని ముందుకు నడిపించడంలో అగ్రకుల పాలకవర్గం వైఫల్యాలను ప్రపంచానికి తెలియపరుస్తూ సమసమాజ స్థాపనకు ప్రతివ్యక్తి నడుం బిగించాలి.

**కులనిర్మూలన జరగక పోవడానికి ముఖ్య కారణాలు:**

1. కులం పుట్టుకకు కారణం ఆయన హిందు మతం తన ఉనికిని కాపాడుకొని పాలక మతంగా నిలదొక్కుకోవటం.
2. కమ్యూనిస్టు పార్టీలు బహుజనులను సాంఘిక పోరాటాలకు దూరంగా ఉంచడానికి ప్రయత్నం చేయడం. మొదటితరం విద్యాధికులైన దళిత

యువత కమ్యూనిస్టు ఆర్థిక పోరాటాల కోసం ప్రాణత్యాగం చేయడం. నక్సలైట్ ఉద్యమంలో ఎన్కౌంటర్ చేయబడిన వారిలో 85% దళితులు అనే సత్యాన్ని వప్పుకుంటానికి ఈ రోజుకు సిగ్గుపడుతుంటాయి. కులం పెత్తనం లో కమ్యూనిస్టులు కూడా ముందువరుసలో వున్నారు.

3. క్రిస్టియన్ సమాజంలోకి మారిన దళిత వర్గ ప్రజలు కూడా సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా పోరాడకుండా మతానికి విధేయులుగా మారి అంబేడ్కర్ ఆలోచనా విధానానికి శత్రువులుగా తయారైనారు.

4. కులనిర్మూలన కులాంతర వివాహాలు, సహపంక్తి భోజనాలు, ఆర్థిక అభివృద్ధి, విద్యాభివృద్ధి వల్ల సాధ్యం కాదని నిరూపించబడింది. కనుక కులనిర్మూలన కోసం రాజ్యాంగపరంగా స్వకుల వివాహాలను నిషేధించాలి.

కుల నిర్మూలన హిందూ మతం వినాశనం మీద ఆధారపడి ఉంది. దాన్ని సాధించేందుకు మనం బుద్ధుడు అనుసరించిన మార్గంలో హిందూ మతం అంతానికి పాటుపడాలి.

బహుజన అధికారం కుల నిర్మూలన వేగాన్ని పెంచుతుంది కనుక రాజకీయ అధికారాన్ని త్వరితగతిన పొంది అంబేడ్కర్ ఆశయం ఆయన సాంఘిక, ఆర్థిక మరియు రాజకీయ సమానత్వాన్ని సాధించడానికి అందరూ పాటుపడాలి. అప్పుడు మాత్రమే స్వేచ్ఛ, సమానత్వం సౌభ్రాతృత్వం పునాదిగా రాజ్యాంగ స్ఫూర్తి ఉన్న భారతజాతి సాధ్యం.

కులనిర్మూలన నా జన్మ హక్కు అనేది గొప్ప నినాదం అయి భారత ప్రజానీకాన్ని అసలైన స్వాతంత్రం వైపు నడిపించాలని కోరుకుందాం.

కులనిర్మూలన అనే గొప్ప గ్రంథం అంబేడ్కర్ గారు రాసి ఈ ప్రపంచానికి అందించి దాదాపు 85 ఏళ్ళు అయిన సందర్భంగా ప్రతివ్యక్తి ఆయన జీవిత లక్ష్యం అయిన కులనిర్మూలన కొరకు ప్రయత్నించాలి.

***

# 10. కుల నిర్మూలనకు రాజ్యాంగమే మందు!

– **భగత్ సింగ్,** హీనయాన బౌద్ధసంఘం, చీరాల

నేనీ వ్యాసం రాయడానికి ఎంచుకున్న పద్ధతి వివేచనతో కూడిన సూక్ష్మస్థాయి పరిశీలన. నలభై ఏళ్లుగా సామాజిక క్షేత్రంలో కులవివక్ష, మతవివక్ష, మతాల్లో ఉపశాఖల్లో వివక్ష చూస్తున్న నేను నా అనుభవాలతో సరి పోల్చుకుని ఈ రచనకు పూనుకున్నాను.

నా ప్రవృత్తిలో భాగమైన గ్రంథ పఠనం, ప్రజా ఉద్యమ క్షేత్రంలో గట్టి పిండాలతో పరిచయాలు, సాన్నిహిత్యం వెరసి నన్నిలా రాసేందుకు పురిగొల్పాయి. అందుకే రిఫరెన్సుల జోలికి పోవడం లేదు. వ్యాసం నిడివి దృష్టిలో ఉంచుకొని ఆయా గ్రంథాలలోని భాగాలను పునర్లిఖించడం లేదు. నాకు ఎదురౌతూ వస్తున్న నా అనుభవంలోని అనేక జీవన సత్యాలను పరిశీలించి ఈ వ్యాసం రాశాను.

వ్యక్తులు, సమూహాలు, ప్రాంతీయ అవసరాలు అవకాశాలే ఆచారాలు జీవన స్థితి మారటం, ఆదరించే అవకాశాలున్న నివాసిత ప్రాంతాలు (HABITATIONS) ఇవి సాధారణంగా బహుజన కులాల్లో భాగమైన షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, వెనుకబడ్డ కులాలే అధికం అన్నది దేశమెరిగిన సత్యం. అంటే S.C, S.T, B.C లు ఈ దినసరి కూలీల ఆకలి బాధల్లో ఉన్న వారిని తమ వారిగా భావిస్తారన్నది సత్యం.

మీ మీ అనుభవాలలో నుండి తరచి చూసి ఎదురౌతున్న ప్రశ్నలకు జవాబులు, ప్రత్యామ్నాయ విధానాలు వెతుకుతారనే ఆశతో ఈ వ్యాసం వ్రాస్తున్నాను. ముందుగా ఈ దిగువప్రశ్నల పరంపరను పరిశీలించండన్నదే నా మొదటి వినతి.

1. హిందూమతాలు లేదా త్రిమతాల మూలకేంద్రకం అయిన కులం పరిణామ వేగం నిలువరించలేనిదిగాను ఆ దిశగాను సాగుతున్నదా?
2. ఈ దేశ హిందూ సమాజం దాని పరిణామ రూపాలను మార్చుకుంటూ నూతన అవతారాలతో వినూత్న క్రియలతో కార్పోరేట్ వ్యవస్థరూపాన్ని సంతరించుకొంటున్నదా?
3. హిందూమత కులబీజాలను ప్రపంచదేశాల భూభాగాలలో విస్తృతంగా నాటుతోందా? ఆయా కుల బీజాంకురాలను సంరక్షించి మొలకలస్థాయి నుండి కుల వటవృక్షాల స్థాయికి పెంచి పోషిస్తోందా?

4. సేవక కులాలైన బహుజన కులాలను S.C, S.T, B.C మైనారిటీ, మహిళలు ఒకరికొకరు అంటు కట్టనీయని విధులు విధానాలు రూపొందించి చాపకింద నీరులా పాకుతూ విడగొడుతున్నారా?

5. వంశ వృక్షాల్లా కుల వృక్ష క్షేత్రాలను సృష్టించి ప్రపంచాన్ని హిందూమత ప్రభావ కులంతో శాసించే స్థాయికి పెంచుతున్నారా?

6. విశాల సేవలందించే సేవక కులాలైన బహుజనుల విధి విధానాలను యాంత్రీకరించి స్థిరీకరిస్తున్నారా?

7. బహుజన కులాలైన ఎస్.టి, బి.సి, ఎస్.సి, ముస్లిం, మైనారిటీ మతాలైన క్రైస్తవం, ఇస్లాం, బౌద్ధం, జైనం, పార్శీలు మొదలగు వారిని ఆటవిక దశలోని వివేచనతో ఆలోచించలేని బానిస వ్యవస్థల్లోకి నెట్టేసే ప్రయత్నాలు పసిగట్టలేని పద్ధతుల్లో కొనసాగిస్తున్నారా?

అందుకే స్వయం సేవక సంఘశక్తులు వేలాది రూపాల్లో విడివడి తమ కుతంత్ర శక్తి సామర్థ్యాలకు పదును పెడుతూ ఉన్నాయి. ఈ పనికి వేల కోట్లరూపాయల నిధులు సమకూర్చుకొని పని చేస్తున్నాయి కనుకనే... స్వయం సేవక సంఘశక్తులన్నీ తమ తమ ఆలోచనలను క్రోడీకరించుకోవడంతో బాటు కోడీకరించు (CODE LANGUAGE) కుంటు ముందుకెళ్తున్నాయి. స్వయం సేవకులంతా తమ విలువైన సమయాన్ని చిలికి (దీన్నే Think Tank అంటారు) కాలకూట విషాన్ని పుట్టించి బహుజన కులాల మెదళ్ళలో దట్టిస్తున్నాయి. బహుళజాతి సంస్థల @ కార్పోరేట్ సెక్టార్ పేర్న విరాజిల్లుతూ హిందూ మత అంకుర కులవిత్తన వృద్ధి క్షేత్రాలను విశ్వ వ్యాప్తం చేస్తున్న తీరు ఆలోచనా పరులందరికీ ఎరుకేగదూ? “మన హిందు మతం” పేరు మీద కులబలం విస్తరణ జరుపుతున్న సంస్థలు ఈ దేశ హిందుత్వ శక్తులేనన్నది వాస్తవ దూరం కాదు గదా!? అమెరికా, ఆస్ట్రేలియా, ఇంగ్లాండ్ మొదలగు దేశాలతో బాటు అత్యంత చిన్న దేశాలైన ఈక్వెడార్ బ్రెజిల్ మరియు ఆఫ్రికా ఖండంలోని కడు పేద దేశాల్లోనూ “మనమంతా హిందువులం” అన్న నినాదం మాటున కుల జోగుల సమీకరణాలు జోరుగా సాగుతున్న తీరు యూట్యూబ్ ఇంటర్నెట్ తదితర సామాజిక మాద్యమాల్లో సాంస్కృతిక కళా వేదికల్లో అందరం చూస్తూనే ఉన్నాం.

బ్రతుకుదెరువు పోరులో ఉపాధి వెతుక్కుంటూ వెళ్తున్న వారిని సైతం మతం మాటున తానా, ఆటా, నాటా, లాంటి “కూటమిలో”కి జొనుపుతూ ఆనక కులమే మన బలం అన్న చోటుకు చేరుస్తున్నారు కదా!

అమెజాన్ అడవులకు కూడ ఈ హిందూ మూలకుల జాడ్యాన్ని అంటిం చేస్తారా? అన్నంత ఆశ్చర్యాన్ని కలిగించే కుల పెంపకపు జోన్లు మానవతావాదులకు కంపరం పుట్టిస్తున్నాయి. హిందూ వ్యవస్థా నిర్మాణకులమైన "బాపనీయం" క్షేత్ర స్థాయిలో కులాన్ని బలోపేతం చేయడానికి విశేషకృషి సాగిస్తోందనడానికి ఒక ప్రత్యక్ష సాక్షి భూత ఉదాహరణ "ఇస్కాన్ " మరియు దాని అనుబంధ సంఘాలు, శ్రీశ్రీశ్రీల ప్రభుపాదులవారి "మాయాపూర్" .

త్రిమతాలైన అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతాలు, ప్రస్తానత్రయాలు ఇవన్నీ వేద ప్రమాణంగా అంగీకరించి పని చేస్తాయన్నది లోక విదితమే! అంటే హిందూ మతశాఖలు, వాటి ఉపశాకలు" హిందూ ధర్మ ప్రచారం" పేరు ఉన్న ఆశ్రమాలు, ఆరామాలు, వేదపాఠశాలలు, వేద విశ్వవిద్యాలయాలు, వైదిక పరిశోధనాలయాలు వైదిక పీఠాలు, మఠాలు, సత్రాలు, స్వాములు, బాబాలు, అమ్మలు, హఠంపేర, మౌనంపేర యోగులు, చివరకు అఘోరాలు సైతం ఈ దేశానికి వలసవచ్చిన మతాలను తమలో ఇమిడిపోయే విధంగా సరళీకరణ విధానాలు ప్రోది చేసుకుంటున్న చతురాంగ వేద హిందూమతం మనుష్యులను శాంతిగా కలసి ఉండనిస్తుందా? అన్నదే ప్రశ్న.

ధర్మ శాస్త్రాల పేరుతో నిత్యనైమిత్తిక కర్మలు – విధి విధానాలకు ఆచరింప చేయడమే ఏకైక లక్ష్యంగా పైన పేర్కొన్న మొత్తం వ్యవస్థా అంగాలు పనిచేస్తున్నాయి. బహుజన కులాలైన సేవక కులాలను చెక్కు చెదరనీయని పద్దతితో సంస్కార విధుల నిర్వహించే వినూతన ప్రక్రియలను రూపొందించి వ్యక్తి స్థాయికి చేర్చి ఆచరింప జేయడం ఆ వ్యవస్థల పని. అందుకవసరమైన ఆర్ధిక వనరులను ఆర్జిత సేవల పేర కోట్ల రూపాయల నిధులను అందుబాటులోకి తేవడం హిందూ దేవాలయాల, స్వామి నారాయణ్‌ల, రామ మందిరాల విధి. ఆ నిధుల వారసులు బాపనీయ కులపతులు. ఈ రకంగా ధర్మకర్మలు అన్న ముసుగేసిన బ్రాహ్మణులు దేశంలో 85% శాతంగా ఉన్న బహుజనులు చెల్లించిన పన్నులతో నిర్మించబడ్డ స్థిర సంపదలను లక్షల వుద్యోగుల వ్యవస్థలను బ్రాహ్మణీయ స్థాపిత మత వ్యవస్థల వెనుక దాగిన కార్పోరేట్ శక్తులకు ధారాదత్తం చేస్తున్న వైనం వివరించి చెప్పలేని స్థితికి ప్రజలను నెట్ట గలిగిన శక్తి ఈ మత శక్తుల సొంతం. తమ భోగం కోసం తమ పిల్లల పిల్లల తరాలకు సకల సౌకర్యాల అమరికకు భాగ్యం @ సంపద కూర్చిబెట్టి భూమీమ్మదే స్వర్గం

అనుభవిస్తున్న హిందూ మత వ్యాపక బాపనీయశక్తులు కులాన్ని ఖండాంతరాలకు వ్యాపింపజేయకుండా మిన్నకుంటారా? హిందుయేతర మతాలైన క్రైస్తవం, ముస్లింలలో సైతం కుల భావనా జాడ్యాన్ని అంటువ్యాధిలా వ్యాపింపజేస్తున్న సత్యం ప్రజా బాహుళ్యం అనుభవిస్తున్నదే! చచ్చిన శవాలను సైతం మత శాఖకు ముడి వేసి గౌరవ సంస్కారవంతమైన చావుకు కూడ దూరం చేస్తున్న సంఘటనలు మనం కళ్లారా చూస్తున్న వేగదూ? ఈ లేకి భావాల పుట్టుక, ఆచరణ ఏ మత మూలానివో తెలుస్తోందా? ఈ వింత ధోరణి ప్రబలి ఎంతవరకూ పోతుందో వేచి చూడటం తప్ప తక్షణ పరిష్కారం లేదు. చివరకు కుల శ్మశానాలు దాటి పాపపు తీర్పు కొరకు వేచి చూసే మతశాఖలు మనుషులను ఏదరికి చేరుస్తాయోగదా! శవానికో శ్మశానస్థలం కావాలన్న డిమాండ్ ముందుకు రాబోతుందేమో? హిందూమత ఛాందస విశ్వాసాలను ఆచారాలుగా మలచి పంటపొలాలను సైతం ధ్వజం ఏ జెండాల రూప ప్రదర్శనలతో సాదా జన మనస్సులపై మన హిందూ “మతం” రంగు ఇదేనని ఎత్తైన జెండాల ద్వారా ప్రదర్శిస్తున్న సామాన్యుల వెనుక ఉన్న ఆయా మత పూజారులేనన్నది కాదనగలమా? ఇప్పటికైనా ఎప్పటికైనా, ఒకే దేవుడు ఒకే మతం, ఉండాలి లేదా ఒకే మతం, ఒకే దేవుడు ఉండాలి. ఆ మతం హిందూమతం. ఆ దేవుడు రాముడు ఆ మతశాఖ వైష్ణవశాఖ ఆదీ ఈ నాటి దేశపు చిత్రపటం అయితే ప్రత్యామ్నాయం లేదా? ఉంది భారత రాజ్యాంగమే పవిత్ర గ్రంథంగా గుడులు, దేవాలయాలు, చర్చిలు, మసీదులు, మఠాలయందు పూజాదికాలు నిర్వహిస్తున్న అర్చకులు, పూజారులు భారత రాజ్యాంగాన్ని ప్రతి దినమూ పఠించి ప్రకటించాలి.

1. ప్రభుత్వం ప్రైవేటు కార్యాలయాల్లో పాఠశాలల్లో, కళాశాలల్లో, విశ్వ విద్యా లయాల్లో మత పోకడలు ఎట్టివీ ప్రదర్శించరాదు.

2. విశ్వాసాలు, మతం, పూర్తిగా వ్యక్తిగతం.

3. సామాజిక శాస్త్రాలను విధిగా అభ్యసించాలి.

4. రహదారులు, బహిరంగ కూడళ్ళలో ప్రయాణ కేంద్రాలైన రైల్వే, బస్ స్టేషన్‌లలో పౌరులు రాజ్యాంగ విధులు బాధ్యతలు నిర్వర్తించవలసిన తీరు అన్ని రకాల మాధ్యమాలు, సోషల్ మీడియాతో సహా ఉద్యమ రూప ప్రచారం చేయాలి.

5. భారత రాజ్యాంగమే మన పాలన ప్రణాళిక అన్న రాజకీయ పార్టీలకే ఓటు వేసే విధంగా ఓటర్లను జాగ్రత్తపరచాలి.

***

## 11. హిందూ మత విశ్వాసాలు నిర్మూలించడానికే, "కులనిర్మూలన"

**– బేతాళ సుదర్శనం,** (AIDRF) ఆలిండియా దళిత రైట్స్ ఫోరం
ఆంధ్రప్రదేశ్ స్టేట్ వర్కింగ్ ప్రెసిడెంట్, ఏలూరు.

డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ కులనిర్మూలన గ్రంథాన్ని 15, మే 1936లో రాశారు. లాహోర్లో జాత్–పాత్–తోడక్ మండల్, కులాన్ని నిర్మూలించాలనే ఒక హిందూ సంస్కరణ సంస్థ, తమ సమావేశంలో డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ ను కుల నిర్మూలన గూర్చి మాట్లాడమని పిలిచి, కులం కారణంగానే ఆ సమావేశ నిర్వహణ రద్దు చేసుకుంది. డాక్టర్ అంబేద్కరే ఈ పుస్తకాన్ని ప్రచురించడం జరిగింది.

ప్రపంచంలోనే కులనిర్మూలన గ్రంథం బెస్ట్ సెల్లర్ గా నిలిచింది. అనేక లక్షల కాపీలు ఇప్పటికే అమ్మబడింది. 85 సంవత్సరాలు జరిగినప్పటికీ ప్రస్తుతం మతోన్మాద శక్తుల దురాగతాలను అడ్డుకొనడానికి, మనువాద స్మృతులను ప్రమాణికంగా భావిస్తున్న వారికి, కుల నిర్మూలన గ్రంథమే శాశ్వతంగా కౌంటర్ ఇవ్వగలుగుతుంది. బ్రాహ్మణీయ భావజాలాన్ని ఎదుర్కొనడానికి ఒకే ఒక పరిష్కార మార్గం కులనిర్మూలన గ్రంథాన్ని చిత్తశుద్ధితో, మనస్ఫూర్తిగా, అవగాహనతో చదువుకొనడమే.

బాంసెఫ్ ఫౌండర్ డీకే కపర్థేగారు స్వయంగా ఇచ్చిన కులనిర్మూలన గ్రంథాన్ని చదివే త్యాగశీలి మాన్యవర్ కాన్షిరామ్ సామాజిక ఉద్యమాల్లో విజయం సాధించ గలిగారు.

కులనిర్మూలన గ్రంథంలో బాబాసాహెబ్ అంబేద్కర్ ఉదహరించిన ఒక కొటేషన్‌ను పరిశీలించి, ప్రస్తుత పరిస్థితులకు ఏ విధంగా అన్వయించవచ్చో తెలుసుకుందాం.

"కులవ్యవస్థ ప్రకృతి విరుద్దమైన ఒక కృత్రిమ వ్యవస్థ. అది చేస్తున్నదల్లా వివిధ కులాల స్త్రీ పురుషులు కులాంతర వివాహాలను చేసుకొనకుండా నిషేధించడం." (పేజీ 31, కుల నిర్మూలన)

స్వాతంత్ర్యం రాకముందు భారతదేశం లోని స్త్రీలందరు శూద్రులే అన్న భావన ఉండేది. బ్రాహ్మణ స్త్రీలకు కూడా హక్కులు నిరాకరించబడినవి. భారత రాజ్యాంగం వచ్చిన తర్వాత, సవర్ణ స్త్రీలు, ఎగువ శూద్ర స్త్రీల యొక్క హక్కులు పరిరక్షింపబడుతూ, ఈ దేశ మూల నివాసులైన బిసి,ఎస్సీ,ఎస్టీ, మైనార్టీ స్త్రీ లు వేరన్న భావన కొట్టొచ్చినట్టు కనపడుతుంది.

లైంగిక దాడులు జరిగిన జ్యోతి సింగ్ పాండే బ్రాహ్మణ స్త్రీ పేరు మార్చి నిర్భయ అనే పేరుతో, ఎగువ శూద్ర స్త్రీ ప్రియాంక రెడ్డి పేరు మార్చి దిశ పేరుతో నిర్భయ, దిశ చట్టాలను తెచ్చి, వారికి ఆర్థికంగా నిబంధనలకు మించి సహాయం చేయగా, అదే రకమైన లైంగిక దాడికి గురైన బీసీ ఎస్సీ ఎస్టీ మైనార్టీ స్త్రీలపట్ల, బాలికలపట్ల, మనువాద ప్రభుత్వాలు తీవ్రమైన వివక్షతకు పాల్పడినవి. ప్రభుత్వాలపైనే పౌరులు ఎస్సీ ఎస్టీ అట్రాసిటీ యాక్ట్ పెట్టవలసిన పరిస్థితి ఎంతైనా ఉంది.

నిందితులు ఆధిపత్య కులాల వారైయితే జైలు శిక్ష వేయడం, మూలవాసులైతే ఎన్కౌంటర్ చేయడం జరుగుతుంది. మనుస్మృతిని తూచా తప్పకుండా బ్రాహ్మణీయ్య ప్రభుత్వాలు అమలు చేస్తున్నాయి.

ఆధిపత్య కులాలకు చెందిన స్త్రీలు ముఖ్యంగా షెడ్యూల్ కులాలు, తెగలు యువకులను ప్రేమ పెళ్ళి చేసుకున్నప్పుడు, వధువు తరపు బంధువులు చేసే హత్యను పరువు హత్యగాను, దిగువ స్థాయి శూద్ర స్త్రీలు ఎస్సీ ఎస్టీ యువకులను ప్రేమ వివాహాలు చేసుకున్నప్పుడు జరిగిన హత్యలను కుల దురహంకార హత్యలుగా బ్రాహ్మణ మీడియా ప్రచారం చేస్తుంది.

మహిళలపై జరుగుతున్న అన్ని లైంగిక అత్యాచారాలను మీడియా ఒకేరకంగా సమాజానికి చూపించడం లేదు. ఎస్సీ ఎస్టీ మహిళలపై లైంగిక దాడి జరిగితే దళిత మహిళపై అత్యాచారం అని బ్యానర్ ఐటమ్ గా బ్రాహ్మణ మీడియా చూపిస్తుంది. అదే ఆధిపత్య స్త్రీలపై అత్యాచారాలు జరిగితే, కుల ప్రస్తావన జరగకుండా నిర్భయ, దిశ అని పేర్కొంటారు.

**డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ కులనిర్మూలన గ్రంథంలో ప్రస్తావించిన బహుజన స్త్రీల పట్ల వివక్షత గూర్చి ప్రస్తావించిన కొన్ని అంశాలు:**

1. మధ్యప్రదేశ్ రాష్ట్రంలో ఇండోర్ సంస్థానంలోని పదిహేను గ్రామాల్లో ఆధిపత్య కులాలవారైన బ్రహ్మణులు, రాజపుత్రులు, కలోతాలు,

పటేల్ పట్వారీలు ఆ గ్రామంలోని ప్రజలకు శ్రీముఖం జారీ చేశారు. బలాయీలు జరీ అంచు ఫాగాలను ధోవతులను ధరించకూడదు. రంగు రంగుల లేక నాజూగ్గా ఉండే దుస్తులను, స్త్రీలు బంగారు వెండి నగలు ధరించకూడదు. ఆధిపత్య స్త్రీల కాన్పు లన్నిటిని విధిగా హాజరై సేవ చేసి తీరాలి. (18 పేజీ)

2. గుజరాత్ రాష్ట్రంలో కవితా గ్రామంలోని గవర్నమెంట్ స్కూల్ లోకి అస్పృశ్య పిల్లలను చేర్చుకోకూడదని, అక్కడి హిందువులు హుకుం జారీ చేశారు. అలాగే 1935లో అస్పృశ్య స్త్రీ లు నీళ్లు పట్టుకోడానికి కుండలకు బదులు బిందెలు వాడటం మొదలు పెట్టారు. ఈ మార్పు వలన హిందూ స్త్రీలు, అస్పృశ్య స్త్రీలపై దౌర్జన్యం జరిపారు. (19పేజీ)

3. బ్రాహ్మణులలో వితంతు పునర్వివాహం ఆచారంగా లేదు. పథారే ప్రభు కులంలో వితంతు పునర్వివాహం వారి కులాచారం గా ఉండేది. కానీ వారిలో కొందరు ఈ ఆచారం ఏదో తక్కువ అని, ప్రభు కులం వారు తమ కులం గౌరవ స్థాయిని పెంచుకోవడం కోసం వితంతు పునర్వివాహ పద్ధతిని రద్దు చేయడానికి నడుం కట్టారు. అందువలన బ్రాహ్మణ కులంలో రెండు ముఠాలు అయినాయి. పీష్వా ప్రభువులు బ్రాహ్మణులు సమర్ధించారు గాని, పథారే ప్రభు కులాన్ని సమర్ధించలేదు. ఎటువంటి పరిస్థితుల్లో వితంతు పునర్వివాహాలు కొనసాగించాలని ఆదేశించారు. (37 పేజీ)

పైన ప్రస్తావించిన అంశాలే ఇప్పటికీ, హిందువులు అనుసరిస్తున్నారు. దళితులు వండిన ఆహారాన్ని మా పిల్లలు తినరు అని చెప్పడం. బహుజన పిల్లలకు ఇంగ్లీష్ మీడియం వద్దు అని అనడం. స్త్రీల దుస్తులపై మతతత్వ వాదులు తీవ్రమైన కామెంట్లు చేయడం అందులోని భాగమే.

నిజమైన స్వాతంత్రం రాని, మూలవాసుల స్త్రీల పట్ల కుల దురహంకార హత్యలు:

1. కాశ్మీర్‌లోని కతువా సమీపంలోని రసానా గ్రామంలో ఆసిఫాబానో 8 ఏళ్ల మైనార్టీ బాలికను అపహరించడం, అత్యాచారం చేయడం.

2. ఆసిఫాబాద్ 30 ఏళ్ల షెడ్యూల్డ్ కుల మహిళ టేకు లక్ష్మి 24 నవంబర్, 2019 అత్యాచారం చేసి చంపారు.

3. సెప్టెంబర్ 06, 2020

ఒడిశాలోని భువనేశ్వర్‌లో 13 ఏళ్ల బాలికపై లైంగిక వేధింపుల కేసులో ఒక పోలీసు, ఇద్దరు మీడియా వ్యక్తులతో సహా ఎనిమిది మందిపై కేసు నమోదైంది.

4. యాదాద్రి భువననగిరి జిల్లాలోని బొమ్మలారామారంలోని హాజీపూర్ గ్రామానికి చెందిన సీరియల్ రేపిస్ట్, కిల్లర్ మార్రి శ్రీనివాస్ రెడ్డి (28)11,13, మరియు 17 సంవత్సరాల వయస్సు గల ముగ్గురు మైనర్ బాలికలపై అత్యాచారం మరియు హత్య కేసులో దోషిగా నిర్ధారించబడింది.

5. భోపాల్: మైనర్ బాలికపై 4 మంది యువకులు సామూహిక అత్యాచారం చేశారు. డిసెంబర్ 25, 2019, సిధి జిల్లాలోని జమోడి గ్రామంలో ఈ షాకింగ్ సంఘటన జరిగింది. నలుగురు టీనేజర్లు 14 ఏళ్ల బాలికపై సామూహిక అత్యాచారం చేశారని, ఆపై ఈ సంఘటనను వీడియోగ్రాఫ్ చేసినట్లు పోలీసులు తెలిపారు.

6. 30 సెప్టెంబర్, 2020 రాజస్థాన్‌లోని బరాన్‌లో సామూహిక అత్యాచారం జరిగినట్లు సమాచారం. నివేదికల ప్రకారం, ఇద్దరు మైనర్ బాలికలను బారన్ నుండి అపహరించారు. నిందితులు బాలికలను కోటా, జైపూర్, అజ్మీర్‌లకు తీసుకెళ్లారు. జీ న్యూస్‌లో వచ్చిన నివేదిక ప్రకారం, వారు మూడు రోజుల పాటు సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు.

7. 30 జూన్ 2020, విశాఖపట్నం జిల్లాలోని జి మాడుగుల పోలీస్ స్టేషన్ పరిధిలోని కె. కోడపల్లె పంచాయితీలో 15 ఏళ్ల బాలికపై 24 ఏళ్ల యువకుడు అత్యాచారం చేసాడు. ఈ సంఘటన జూన్ 27 న జరిగినప్పటికీ, కుటుంబ సభ్యులు మంగళవారం స్థానిక పోలీసులకు ఫిర్యాదు చేయడంతో ఇది వెలుగులోకి వచ్చింది.

8. 14 మంది మైనర్ బాలికలపై సామూహిక అత్యాచారం. ది ఎకనామిక్ టైమ్స్, గుజరాత్.

04–ఆగష్టు–2020 గుజరాత్లో మైనర్ బాలికపై అత్యాచారం కేసులో నిందితుడు అంతకుముందు ఏడాది జైలు శిక్ష అనుభవించాడు ...

రాజస్థాన్ యొక్క బరాన్ జిల్లాలో ఇద్దరు మైనర్ బాలికలపై ఒక ముఠా అత్యాచారం: ఒక మైనర్ నిందితులను పోలీసులు పోలీస్స్టేషన్కు తీసుకువచ్చారు.

రాజస్థాన్లో రెండు రోజుల పాటు ఇద్దరి మైనర్ బాలికలు గ్యాంగ్ రేప్ చేశారు.

అక్టోబర్ 01, 2020 గౌహతి: దారుణమైన సామూహిక అత్యాచారంపై దేశవ్యాప్తంగా ఆగ్రహం. 06–ఫిబ్రవరి –2017 – హైదరాబాద్ పోలీసులు తెలిపిన వివరాల ప్రకారం, మైనర్ బాలిక ఇంట్లో టీనేజ్ కుర్రాడు రెండుసార్లు అత్యాచారం చేసాడు.

09–సెప్టెంబర్ – 2020 – గిరిజన సోదరీమణులలో ఒకరు మరణించగా, మరొకరి పరిస్థితి విషమంగా ఉందని చెబుతున్నారు.

దేశవ్యాప్తంగా జరిగిన కొన్ని లైంగిక దాడుల కేసులను పరిశీలించినట్లయితే ఎస్సీ ఎస్టీ బీసీ మైనార్టీ బాలికల పట్ల, స్త్రీల పట్ల నిరంతరం దేశంలో అత్యాచారాలు జరుగుతున్నవని రుజువు అవుతుంది. ప్రపంచంలోనే మహిళల అభివృద్ధిలో అధమ స్థాయిలో ఉందని, ఈ దేశం అభివృద్ధికి నోచుకోలేదని, కులనిర్మూలన గ్రంథంలో బాబాసాహెబ్ చెప్పిన కొటేషన్ ద్వారా మనం అర్థం చేసుకోవచ్చు.

బ్రాహ్మణీయ భావజాలం దినదినాభివృద్ధి అవుతుంది కనుకనే లైంగిక దాడులకు పాల్పడుతున్న వారిని కూడా విడుదల చేయాలని, శిక్షలు విధించకూడదని లాయర్లు సైతం ఈ దేశంలో ధర్నాలు, ర్యాలీలు చేస్తున్నారంటే భారతదేశంలోని ప్రజాస్వామ్యం ఏ స్థితిలో ఉందో అర్థం చేసుకోవచ్చు.

హిందూ మతంలో, ఒకరు మాట్లాడే స్వేచ్ఛను కలిగి ఉండలేరు. ఒక హిందువు తన వాక్ స్వేచ్ఛను అప్పగించాలి. అతడు వేదాల ప్రకారం నడుచుకోవాలి. వేదాల చర్యలకు మద్దతు ఇవ్వకపోతే, స్మృతుల నుండి సూచనలు తీసుకోవాలి, మరియు స్మృతులు అలాంటి సూచనలు ఇవ్వడంలో విఫలమైతే, అతను గొప్ప వ్యక్తుల అడుగుజాడల్లో ఉండాలి.

అతను కారణం చెప్పాల్సిన అవసరం లేదు. అందువల్ల, మీరు హిందూ మతంలో ఉన్నంత కాలం, మీకు ఆలోచనా స్వేచ్ఛ ఉంటుందని ఆశించలేరు.

**స్వేచ్ఛాలోచనే, నిజమైన స్వేచ్ఛ:**

గొలుసులతో బంధించక పోయినా, స్వేచ్ఛాలోచనా లేని వ్యక్తి, బానిస. స్వేచ్ఛ లేనప్పుడు మనిషి కాదు, కేవలం బానిసే. స్వేచ్ఛాలోచన లేని వారు జైలులో లేకపోయినా, ఖైదీయే కాని, స్వేచ్ఛ ఉన్న మనిషి కాదు.

మనిషి సజీవంగా ఉన్నప్పటికీ, స్వేచ్ఛ లేనివారు, చనిపోయినవారి కంటే గొప్పవారు కాదు.

**స్వేచ్ఛాలోచన ఒకరి ఉనికికి రుజువు:**

ఉదాసీనత అనేది ప్రజలను ప్రభావితం చేసే అత్యంత దుర్భలమైన వ్యక్తిత్వం. బుద్ధిని ఉపయోగించడమే మనిషి ఉనికి యొక్క అంతిమ లక్ష్యం.

**"నేను హిందువుగా జన్మించినప్పటికీ, నేను హిందువుగా చనిపోనని గంభీరంగా భరోసా ఇస్తున్నాను. స్వేచ్ఛ, సమానత్వం మరియు సోదరభావం నేర్పించే బౌద్ధాన్ని నేను ఇష్టపడుతున్నాను."**

ఏ మతం అయితే కులాన్ని ప్రవేశపెట్టిందో ఆ మతాన్ని నిర్మూలించకుండా కుల వ్యవస్థ నిర్మూలన కాదు అని నిక్కచ్చిగా, నిర్భీతిగా కుండబద్దలు కొట్టారు బాబాసాహెబ్ అంబేద్కర్.

***

"చాతుర్వర్ణం వంటి భ్రష్ట వ్యవస్థ ప్రపంచంలో మరెక్కడా కనిపించదు. ప్రజలను జీవచ్ఛవాలుగా, నిర్‌వ్యాపారులుగా, పక్షవాత రోగులుగా, క్షతగాత్రులుగా, ఎందుకూ పనికిరాని దద్దమ్మలుగా తయారుచేసిన నికృష్ట నీచ వ్యవస్థ ఇది. ఇందులో అతిశయోక్తి ఏదీ లేదు.."

# 12. ద్వేషంతో కూడిన కులవివక్షను నిజాయితీగా చిత్రీకరించిన డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ చలనచిత్రం

**–ఆర్. శివలక్ష్మి,** సినిమా క్రిటిక్, మంచి సినిమా గ్రూప్, హైదరాబాద్

నేషనల్ ఫిల్మ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, సామాజిక న్యాయం–సాధికారత మంత్రిత్వ శాఖ సంయుక్తంగా 2000 సంవత్సరంలో నిర్మించిన "డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ : ది అన్‌టోల్డ్ ట్రూత్" అనే అద్భుతమైన డాక్యుమెంటరీని హిందీ, ఇంగ్లీష్ భాషలలో రూపొందించారు. ఈ చిత్ర దర్శకులు జబ్బార్ పటేల్. దీనిని తిర్లోక్ మెహతా నిర్మించారు. ఈ చిత్ర నిడివి 180 నిమిషాలు.

**చిత్ర ఇతివృత్తం :** 1913 నుండి 1956లో డాక్టర్ భీంరావ్ అంబేద్కర్ మరణానికి రెండు నెలల ముందు బౌద్ధమతంలోకి మారే వరకూ అంబేద్కర్ జీవితంలోని ముఖ్యమైన సంఘటనలను ఈ చిత్రం వివరణాత్మకంగా దృశ్యీకరించింది. స్వతంత్ర భారతదేశంలో మొట్టమొదటి న్యాయశాఖా మంత్రిగా, స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగ ముసాయిదా కమిటీ ఛైర్‌పర్సన్‌గా అహర్నిశలూ అట్టడుగు వర్గాలకోసం ఆయన చేసిన కృషిని ఈ డాక్యుమెంటరీ చిత్రీకరించింది..

చిత్ర ప్రారంభమే చాలా హృదయవిచారకంగా అస్పృశ్యుడనబడే ఒక వ్యక్తి దోసిలిపట్టి నీళ్ళు తాగుతుండడం, ఆ ఇంటి యజమాని ఇంతెత్తు నుంచి ఆయన దోసిలిలో నీళ్ళు పోయడం కనిపిస్తుంది. నేపథ్యంలోంచి "శూద్రులనగా ఎవరు? వారెందువల్ల అంటరానివారయ్యారు? అంటూ సృష్టికర్త ఉద్ఘాటించాడంటూ ధర్మశాస్త్రమంటూ మనుస్మృతి కల్పించిన వ్యవస్థలోని క్రూరమైన కుట్రను వివరించే నేపథ్య వ్యాఖ్యానంతో పాటు ఆ యా దయనీయమైన దృశ్యాలు ప్రేక్షకులకు కనిపిస్తాయి!

సీన్ మారి అమెరికాలోని కొలంబియా విశ్వవిద్యాలయంలో అంబేద్కర్ చదువుతుంటారు. హోమ్‌రూల్ ఉద్యమ నాయకుడు లజపతిరాయ్, నీగ్రో అర్బన్ లీగ్ అధ్యక్షుడు ప్రొఫెసర్ సెలిగ్మాన్ అంబేద్కర్‌ని కలుసుకుని హోమ్‌రూల్ ఉద్యమంలో చేరమని అడుగుతారు. కానీ అంబేద్కర్ తాను అమెరికాకి బరోడా సంస్థానం వారి స్కాలర్‌షిప్ మీద వచ్చాననీ, తన పూర్తి సమయాన్ని చదువుకోసం మాత్రమే ఉపయోగిస్తానని ఖచ్చితంగా వారితో చెప్తారు. బరోడా వారిచ్చే డబ్బు

సరిపోక పోవడంతో చాలా ఆర్థిక ఇబ్బందుల్లో ఉండి తనను తాను నిలదొక్కుకోవడానికి అంబేద్కర్ పార్ట్‌టైం ఉద్యోగంగా ఒక హొటల్‌లో 'స్టీవ్' అనే నల్లజాతి యువకుడితో కలిసి గిన్నెలు కడగడం చూస్తారు ప్రేక్షకులు!

ఒక రాత్రి అంబేద్కర్ మనుస్మృతిని చదువుతూ తన చిన్ననాటి మూడు సంఘటనల్ని రోజుల్ని గుర్తుచేసుకుంటారు. "శూద్రులు తక్కిన మూడు జాతుల వారికీ సేవలు చెయ్యడమే వారి బాధ్యతని భగవంతుడు నిర్దేశించాడని మనుస్మృతి చెప్తుంది. శూద్రులకు సంపాదించుకునే సామర్థ్యం ఉన్నా వారందుకు అర్హులు కాదు. శూద్రులలో ధనవంతులుండడం అగ్రవర్ణాలవారికి కంటగింపుగా ఉంటుంది. చిన్నతనంలో భీం రావ్ తన తల్లితో చీరల దుకాణానికెళ్తాడు. అక్కడ వాళ్ళమ్మ ఇచ్చిన డబ్బుని అంటుకోకుండా తీసుకోవడం, నేలమీద నీళ్ళుపోసి, చీరని బురదమట్టిలో పొర్లించి దూరంగా విసిరివేయడం చూస్తాడు బాల భీం రావ్. కొంచెం పెద్దవాడయ్యాక ఒక దున్నపోతుకి క్షవరం చేస్తున్న తనతో, "నేను డబ్బిస్తాను, నాకు క్షవరం చెయ్యమంటా"డు అంబేద్కర్. 'డబ్బిస్తే మాత్రం కులం పోగొట్టుకుని ఒక మహర్‌కి క్షవరం చేస్తానా' అని అతను అహంకారంగా తిడతాడు. "మరి దున్నపోతుకు చేస్తున్నావుగా" అని అంబేద్కర్ అడిగితే 'అవున్రా, నువ్వీ దున్నపోతు కంటే, గాడిద కంటే, కుక్కకంటె హీనమ'ని అంటాడు. 'అగ్రవర్ణాలవారు శూద్రుల సమక్షంలో వేదాలు చదవకూడదు. ఒకవేళ శూద్రులు వేద పఠనం వింటే వారి చెవులలో కరిగించిన సీసం పొయ్యాలి. వారు వేదం చదివితే నాలుకలు కత్తిరించాలి' అని చదువుతూ తన ఎదురుగా ఎవరు వేదాల్ని మలిన పర్చినా సహించనని, తనని బ్రాహ్మణుడైన ఒక టీచర్‌గారు తిట్టారని తండ్రి ఎదుట భోరుమని ఏడుస్తారు అంబేద్కర్. ఆ విషయాన్ని మరీ మరీ తల్చుకుని దుఃఖిస్తుంటే, "నువ్వో సుబేదార్ మేజర్ మనవడివి, ఇంకో సుబేదార్ మేజర్ కొడుకువని గుర్తుంచుకోమనీ, మేకల్ని బలిస్తారు గానీ సింహాల్ని కాదనీ తండ్రి గద్దించి చెప్పడాన్ని జ్ఞాపకం చేసుకుంటారు అంబేద్కర్.

అమెరికాలో ఆర్థికశాస్త్రం ప్రధానాంశంగా సామాజిక శాస్త్రం, చరిత్ర, మానవ శాస్త్రం సామాన్యాంశాలుగా 1915 జూన్‌లో ఎమ్.ఏ. పరీక్షలో ఉత్తీర్ణులవుతారు అంబేద్కర్. రెండు ఎం ఏలు, డాక్టరేట్ డిగ్రీలను కేవలం మూడు సంవత్సరాల్లో పూర్తిచేసి, 'ప్రాచీన భారతీయ వాణిజ్యం' అనే తన పరిశోధనా గ్రంథాన్ని కొలంబియా విశ్వవిద్యాలయంలో సమర్పించే సమయంలో ప్రొఫెసర్ గోల్డెన్ వైజర్ (Alexander

Golden Weiser) గారికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ, అంబేడ్కర్ ఇండియాలో చాతుర్వర్ణ వ్యవస్థ గురించి మాట్లాడతారు. "ఒక సగటు భారతీయుడు, అంతెందుకు ఒక సగటు అమెరికన్ కూడా భారత దేశ గ్రామీణ వ్యవస్థ గురించి గొప్పగా భావిస్తాడు. పైకి అందంగా కనిపిస్తున్న గ్రామాల్లో ఇప్పుడు అమలవుతున్న గ్రామీణ వ్యవస్థ గురించి మీకు వివరించడం మంచిది. భారతీయ గ్రామంలో అందరూ ఒకటి కాదు. అది అగ్రవర్ణాలవారు-అంటరానివారు అని రెండు భాగాలుగా విభజించబడింది. అగ్రకులాలవారు పాలకులవుతారు. అంటరానివారు వారికి సేవలు చేసే బానిసలుగా మిగిలిపోతారు. నిమ్న కులస్థులు అగ్రవర్ణాల వారితో గట్టిగా మాట్లాడకూడదు. వీరు వీధిలో గట్టిగా కేకలు పెట్టుకుంటూ వెళ్ళాలి. అది విని వీరిని చూడకుండా అగ్రవర్ణాలవారు మొహం తిప్పుకుంటారు. ఈ తేడా పుట్టుకతోనే సంక్రమిస్తుంది. ఎవరికీ తప్పించుకునే వీలే లేదు" అని వివరిస్తారు!

తర్వాత 'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్'లో చదవడం కోసం బ్రిటన్ కి వెళ్తారు అంబేద్కర్. పరిశోధన ఇంకా 10 నెలలుండగా అంబేద్కర్‌కిస్తున్న ఉపకార వేతనం రద్దైందనీ, వెంటనే వచ్చి ఒప్పందం ప్రకారం బరోడా సంస్థానంలో 10 సంవత్సరాలు పనిచెయ్యాలనీ దివాన్ నుండి కబురొస్తుంది. లండన్ చదువు మధ్యలో వదిలేసి 1917 లో నేరుగా బరోడాలో ఉద్యోగంలో చేరడం కోసం ఇండియాకి తిరిగి వచ్చేస్తారు అంబేద్కర్. బరోడా మహారాజు గారు రైల్వే స్టేషన్‌కి తనకోసం ఎవరినైనా పంపిస్తారేమోనని ఎదురు చూస్తారు. ఎంతసేపు చూచినా ఎవరూ రారు. చివరికి టాంగా అతన్నడిగి హొటళ్ళన్నీ గాలించినా మహర్ కులం అని చెప్పగానే ఎవరూ గది అద్దెకివ్వరు. ఇక ఇంటి కోసం వెతికే క్రమంలో ఎన్నో పడరాని, భరించలేని కష్టాలు పడతారు. నిజానికి బరోడాలో ఉద్యోగంలో చేరాక ఇల్లు చూసుకుని కుటుంబాన్ని తీసుకెళ్ళాలనుకుంటారు. ఆఫీస్ లో సేవకుడు ఫైల్ అడిగితే దూరం దూరం నుంచి మీద పడేస్తాడు. మంచినీళ్ళడిగితే నీళ్ళున్నప్పటికీ లేవని చెప్తాడు. చివరికి పర్షియన్ నని అబద్ధమాడి, ఎలుకలు తిరిగే ఒక చిన్న మురికి గది సంపాదిస్తే, అది తెలిసి అక్కడి పెద్ద మనుషు లనబడే అగ్రవర్ణాలవాళ్ళు మూకుమ్మడిగా వచ్చి దాడి చేస్తూ, బరోడా సంస్థానంలో అధికారి అని తెలిసి కూడా భయంకరంగా, నీచంగా తిడుతూ బయటికి గెంటేస్తారు. గత్యంతరం లేక బరోడా మహారాజుని కలుస్తారు. మహారాజు గారు ఎదురొచ్చి సగౌరవంగా ఆహ్వానించి, నీ రచన చదివాను అద్భుతంగా ఉంది. నిన్ను చూచి గర్వపడుతున్నా నంటారు గానీ నాకో ఇల్లు కావాలని అంబేడ్కర్ అడగ్గానే 'నా సమస్యని కూడా

నువ్వర్థం చేసుకోవాలి. అసలే నీకుద్యోగం ఇచ్చి నేనో విప్లవాన్ని సృష్టించాను. కేవలం ఈ కులవ్యవస్థను ఒక్కరోజులో రూపు మాపాలనుకోవడం అవివేకం. అందుకు సమయం కావాలి. ఓర్పు వహించాలి'– అని అంటారు. ప్రతి అవమానపడిన సందర్భాన్నీ ఎంతో ధైర్య సాహసాలతో, ఆత్మ గౌరవంతో గెలిచిన అంబేడ్కర్, ఈ సమయంలో ఆయన తన దుఃఖాన్ని పంచుకోవడానికి కూడా ఎవరూ లేక ఏకాంతంగా, చాలా నిస్సహాయంగా, బేలగా ఒక పబ్లిక్ పార్క్‌లో కూర్చుని పైకే ఏడ్చేస్తారు. అందులోనూ అమెరికా, లండన్‌లలో అప్పటివరకూ అందరితో సమానమైన హోదాననుభవించి ఉన్నారు కాబట్టి పరాకాష్టకు చేరిన ఈ కుల వివక్షను ఎదుర్కోవడం ఆయనకు వశం కాదు! ఈ సన్నివేశంలో కుల వివక్ష పరాకాష్టను చూస్తారు ప్రేక్షకులు!

నిలువ నీడ లేక, గత్యంతరం లేని పరిస్థితుల్లో ఇంటికి తిరిగొచ్చి బొంబాయి సైడెన్హాం కాలేజ్ లో చేరతారు. అక్కడి విద్యార్థులు ఒక అంటరానివాడు, మహర్ కులస్థుడు మనకి ఇంగ్లీష్ పాఠాలు చెప్పడ మేమిటి? అని అగ్రవర్ణ విద్యార్థులు వాళ్ళలో వాళ్ళు హేళనగా మాట్లాడుకుంటారు. అంబేడ్కర్ తన అర్హతలన్నీ ఇంగ్లీష్ భాషలో వివరించి "మీకు బోధించే శక్తి సామర్థ్యాలు నాకు లేవని మీలో ఎవరికైనా అనిపిస్తే, వాళ్ళు వెంటనే క్లాస్ లోంచి వెళ్ళిపోవచ్చు" అని సాధికార దర్పంతో జవాబు చెప్పి వాళ్ల నోళ్లు మూయిస్తారు. విద్యార్థులు కిక్కురుమనకుండా కూర్చుంటారు. నీళ్ళు తాగబోతుంటే త్రివేది అనే ఒక అధ్యాపకుడు అడ్డగిస్తాడు. 'మీ నీటిని మీ ఇంటి నుంచే తెచ్చుకోవాలంటా'డు. దానికి అంబేడ్కర్, చాలా నింపాదిగా చక్కగా నీళ్లు వంపుకుని తాగి, "రేపటినుంచి మీరందరూ మీ ఇళ్ళ నుంచే నీళ్ళు తెచ్చుకోండి. ఒకవేళ ఈ నీరు అపవిత్రమై పోయాయని మీరు భావిస్తే, పవిత్రం చేసుకునే మంత్రాలు మీకు తెలుసుగదా, లేకపోతే నేను చెప్తానని ఆ మంత్రాన్ని రెండుసార్లు చదివి వినిపిస్తారు. ఇక ఇక్కడి నుంచి అంబేడ్కర్ ప్రతి సందర్భంలోనూ ఎదురైన ప్రతి దానికీ ఆత్మ విశ్వాసంతో ధీటైన జవాబు లివ్వడం చూస్తారు ప్రేక్షకులు!

అణచబడ్డ ప్రజల్ని చైతన్య పరచాలనుకుని 1920లో అంబేడ్కర్ "మూక్ నాయక్'' (గొంతు నొక్కబడిన వారికి నాయకుడు) అనే పక్ష పత్రికను తేవాలనుకుంటారు. కొల్హాపూర్ సాహూ మహారాజ్ అంబేడ్కర్‌ని కలిసి, పత్రికకీ, ఆగిపోయిన లండన్ చదువు కొనసాగించడానికీ కూడా ఆర్థిక సహాయం

చేస్తానంటారు. వర్ణవ్యవస్థ సృష్టిస్తున్న దుస్సంప్రదాయాల్ని తుడిచి పెట్టాలని, దళితులకు బ్రాహ్మణులు చేస్తున్న దురాగతాల నుంచి విముక్తి కలిగించాలనే అభిప్రాయంతో రాజీ పడకుండా పూర్తిగా సమర్ధిస్తారు కొల్హాపూర్ సాహూ మహారాజ్. అంబేడ్కర్ మాంగావ్‌లో ఏర్పాటు చేసిన ఒక బహిరంగ సమావేశానికి ఆయన హాజరై 'ప్రియ మిత్రులారా అంబేడ్కర్‌లో మీకొక రక్షకుడున్నాడనే నమ్మకాన్ని నాకు కలిగించింది. అతను మీ సంకెళ్ళను తెంచగలడని ఘంటాపథంగా చెప్పగలను. అంతేకాదు, ఏదో ఒకరోజున అంబేడ్కర్ ఇండియాలో ఒక మహోన్నత నాయకుడుగా ప్రకాశించడం తథ్యం" అని ప్రసంగిస్తారు.

లండన్‌లో "బంగారం ధర–రూపాయి సమస్య మీద" తన పరిశోధన పూర్తయిన తర్వాత 1923 లో ఇండియాకి తిరిగొస్తారు అంబేడ్కర్. దీనంగా కనిపిస్తున్న తన జాతి జనుల నుద్దేశించి, "మీరెందుకు మేల్కోరు? మీ జాలిగొలిపే మొహాల్ని చూసినా, మీ దీనమైన గొంతులు విన్నా నా గుండె పగిలిపోతుంది. హిందూ అగ్రవర్ణాలవారు మనల్ని నరకంలో బతకమని శాసిస్తూ, మనకు అంటగట్టిన దుర్భర జీవన విధానాన్ని నేటితో విసర్జించమని మిమ్మల్ని కోరుకుంటున్నాను. వారు మన హక్కుల్ని కాలరాసి, మనల్ని అణగదొక్కి హీనంగా చూస్తున్నారు మేల్కొండి. ఎందుకు మీరు మీ బాధల్నీ, పేదరికాన్నీ, బానిసత్వాన్నీ, ప్రాపంచిక కష్టాల్నీ, మీ దైన్యమైన, నీచమైన అసహ్యకర జీవితాల్లో మరింత హీనపరుచుకుంటున్నారు? ప్రతి ఒక్కరూ మీ హక్కులేమిటో తెలుసుకోవాలి. చీకటైన జీవితాల్లో వెలుగులు నింపుకోవాలి. మేల్కొండి. వాస్తవానికి ఈ దేశంలో హెచ్చు తగ్గులు లేకుండా, అందరితో సమానంగా కూడూ, గుడ్డా, నీడా పొందడం అందరి జన్మ హక్కు. అందుకే చదువుకోండి. తిరగబడండి. సంఘటిత మవ్వండి. ఆత్మ విశ్వాసాన్ని పెంచుకోండి. పరిశుభ్రత నేర్చుకోండి. కుళ్ళిపోయిన మాంసాహారాన్ని, ఎంగిలి మెతుకుల్ని తినబోమని శపథం చెయ్యండి. మీ పిల్లల్ని చదివించండి. వాళ్ళు గొప్పవాళ్ళు కావాలని వాళ్ళ మనసుల్లో బీజాలు నాటండి" – అంటూ 'మేల్కొండి' అనే పదాన్ని గొప్ప అజమాయిషీతో గర్జించి పలుకుతూ చైతన్యాన్ని రగిలించేలా శక్తివంతంగా ప్రసంగిస్తారు అంబేడ్కర్. ఆయన వల్ల ప్రభావితులైన జనం క్రమక్రమంగా తమ అలవాట్లను మార్చుకున్నారనీ, పరిశుభ్రంగా ఉండడం నేర్చుకున్నారనీ ఆయన స్నేహితుల్లో ఒకరు రాశారు!

కొందరు కుల నిర్మూలన వాదుల సమావేశంలో అంబేద్కర్ "ప్రియమైన పాఠకులారా; మూక్ నాయక్ పత్రిక ఆపేయడం వల్ల అణచివేయబడ్డ నిమ్న జాతుల కష్టాలను ప్రతిబింబిస్తూ నేను కొత్తగా "బహిష్కృత్ భారత్" అనే కొత్త పక్ష పత్రికను ప్రారంభిస్తున్నాను. నిమ్న జాతుల వారందరూ సంఘటితమై మహాడ్ సత్యాగ్రహాన్ని బలపరచవలసిందిగా కోరుకుంటున్నాను. ఈ అన్యాయాల్ని మనం ప్రతిఘటించాలి. మన మహాడ్ ఉద్యమాన్ని అంటరానివారి ప్రవేశంతో మొదలుపెడదాం. ఇది సామాజిక విప్లవానికి నాంది కావాలి. కాంగ్రెస్ ని నమ్మే పరిస్థితి లేదు కాబట్టి మనం 'బహిష్కృత్ హితకారిణీ సంస్థ' అనే ఒక సంస్థను స్థాపించి మన సమస్యలను నేరుగా బ్రిటీష్ ప్రభుత్వానికి తెలియ జేద్దాం" అంటారు. బోలే రిజల్యూషన్ తీర్మానాన్ననుసరించి అంబేద్కర్ నేతృత్వంలో దావ్ దార్ సరస్సులోని నీటిని తాగడానికి 10,000 మందితో కలసికట్టుగా వెళ్ళేముందు అశేష ప్రజావాహిని నుద్దేశించి అంబేద్కర్ "ఈ సమావేశం భారత దేశంలో సమానత్వ యుగానికి నాందీ ప్రస్తావనగా ఏర్పాటు చేయబడింది. ఇది భారతదేశ చరిత్రలో మునుపెన్నడూ జరగనిది. దీన్ని 1789 లో జరిగిన ఫ్రెంచ్ విప్లవంతో పోల్చవచ్చు. ఇది మన దేశంలో సామాజిక విప్లవానికి ఆరంభం. దీని ప్రధాన లక్ష్యం అస్పృశ్యతను రూపుమాపడమే కాదు, మహా వృక్షంలా పాతుకుపోయిన ఈ కుల వ్యవస్థను కూకటి వేళ్ళతో పెకలించి వేయడమే! ఈ చెరువులో నీరు తాగినంత మాత్రాన మనకేం అమరత్వం రాదు. కానీ ఈ చర్య మనం కూడా మనుషులమేనని ఈ లోకానికి చూపిస్తుంది. పుట్టుక మన చేతుల్లో లేదనే విషయాన్ని మనం యావద్భారత దేశానికీ చాటి చెప్పాలి. మన భారతీయ సమాజాన్ని కులరహిత, వర్గరహిత సమాజంగా పునర్నిర్మించాలి. మనుషులంతా సమానులై పుట్టాలి. సమానులై మరణించాలి అనే సిద్ధాంతాన్ని మనందరం పాటించాలి. సమాజంలో స్త్రీ–పురుష సమానత్వంతో పాటు, అందరికీ సమాన హోదా ఉండాలి. అంతే కాదు, అసమానతల చుట్టూ పరమ దుర్మార్గంగా అల్లబడిన పురాతన హైందవ సిద్ధాంతాన్ని మనం మట్టుపెట్టాలి. మన పోరాటం సంపద కోసం, పదవుల కోసం కాదు. ఈ పోరాటం స్వేచ్ఛ కోసం, ఆత్మ గౌరవం కోసం, న్యాయం మనవైపుంది. ఈ పోరాటంలో మనకు విజయం తథ్యం" అని గొప్ప స్ఫూర్తినిచ్చేలా ప్రసంగిస్తారు. సభలోని ప్రజలందరూ తమ పూర్తి అంగీకారాన్ని చప్పట్ల హోరుతో తెలియపరుస్తారు! ఉత్తేజకరమైన నినాదాలతో, ఊరేగింపుగా

వెళ్ళి నీటిని తాగే సందర్భాన్ని ప్రజలు ఒక ఉత్సవంగా ఆనందిస్తారు! తర్వాత అంబేడ్కర్ నేతృత్వంలో ప్రజలందరి ఎదుటా మనుస్మృతిని తగలబెడతారు!!

లండన్ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌లో దేశ జనాభాలో 5% గా ఉన్న అణగారిన వర్గాలవారి సమస్యలను 'మాకు తగిలిన గాయాలు ఎలాంటి చికిత్సా లేకుండా ఆరకుండా అలాగే ఉన్నాయి. 150 సం. బ్రిటీష్ పాలనలో కూడా మాకెటువంటి ప్రయోజనం కలగలేదు. ప్రభుత్వం మమ్మల్ని చాలా నిర్లక్ష్యం చేస్తుంది. మానవ చరిత్రలో ఇంతవరకూ కనీ వినీ ఎరగని ఎవ్వరూ ఊహించలేని దుర్భర నిస్సహాయ స్థితిలో మేం మగ్గిపోతున్నాం. ఇది మారాలి. అధిక శాతం జనాభా అంగీకరించలేని ఏ రాజ్యాంగమూ పనికిరాదన్నది ఎవరూ కాదనలేని సత్యం' అని తన వాదనను బలంగా వివరిస్తారు అంబేడ్కర్!

అంబేడ్కర్‌కి గాంధీజీతోనూ, కాంగ్రెస్‌తోనూ తీవ్రమైన విభేదాలొస్తాయి. 'ప్రభుత్వ స్థిరత్వం' అవసరమని గాంధీ వాదిస్తే, 'కుల మతాల ఆధారంగా వివక్షను రద్దు చేయడం చాలా ముఖ్యం' అని అంబేడ్కర్ పేర్కొంటారు. దేశ ప్రయోజనాలు కాపాడుతూ, అట్టడుగు ప్రజల ప్రాథమిక హక్కులు కోసమే అవిశ్రాంతంగా పోరాడతారు అంబేడ్కర్. 'మహాత్ములెందరో వచ్చారు, వెళ్ళారు గానీ అంటరానివారు, అంటరానివారుగానే మిగిలిపోయార'ని తీవ్ర మనోవేదన చెందుతారు. గాంధీజీ మహర్షి కాదనీ కాకలు తీరిన రాజకీయవేత్త అని అంబేడ్కర్ అంటారు. నన్ను దీపపు స్తంభానికి ఉరేసినా, సరే, నేను అణగదొక్కబడుతున్న వాళ్లకి ద్రోహం చెయ్యలేనని ప్రతిజ్ఞ చేస్తారు. అంబేడ్కర్‌కి వ్యతిరేకంగా అగ్రవర్ణ హిందువులు దేశవ్యాప్తంగా ఉద్యమిస్తారు. ఈ దేశంలోని దీనజనుల హక్కుల కోసం అడిగినందుకు హిందూ వ్యతిరేకిగా, ఇండియాకి బద్ధ విరోధిగా అంబేడ్కర్‌ని చిత్రిస్తారు. దేశద్రోహిగా కూడా ముద్ర వేస్తారు. కానీ దేశభక్తుడని నిరూపించే సంఘటనలున్నాయీ చిత్రంలో. వారిరువురి మధ్యా జరిగిన తీవ్రమైన ఘర్షణ వాతావరణాన్ని చిత్రంలో ఎవరికి వారు చూడాల్సిందే!

రాజ్యాంగ నిర్మాణం కోసం ప్రపంచ నిపుణులందర్నీ సంప్రదిస్తుంటారు నెహ్రూ. స్వతంత్ర భారత నిర్మాణాన్ని ఒక బాధితుడే చెయ్యగలడని అందుకు అంబేడ్కరే సమర్దుడని అతనికప్పజెప్పమంటారు గాంధీజీ. ముంచుకొస్తున్న అనారోగ్యాన్ని ఏమాత్రం లెక్క చెయ్యకుండా రాజ్యాంగ రచన భారాన్నంతా ఎంతో బాధ్యతగా పూర్తిచేసి, రాష్ట్రపతి కప్పగిస్తూ, "రాజ్యాంగ ప్రతి ఎంత బాగా ఉన్నప్పటికీ దాన్ని

రూపొందించేవారు చెడుగా ఉంటే అది చెడుగా, అదే వారు మంచి వారయ్యింటే అది మంచిగా కనిపిస్తుంద'ని చెప్తారు అంబేద్కర్!

ఇవి ఇందులోని చరిత్రాత్మకమైన ముఖ్య సంఘటనలు! కానీ ఈ డాక్యుమెంటరీలోని ప్రతి దృశ్యం, ప్రతి ఫ్రేమూ రెప్పలార్పకుండా చూచితీరాల్సినవే, ఎవరికి వారు చూచి తమ అవగాహనను పెంపొందించుకోవల్సిందే. ఈ సినిమా అనే దృశ్య కావ్యం రాతకు లొంగదు!

**ఈ చిత్రం ప్రత్యేకతలు!**

ఇది భారతదేశంలో వచ్చిన చిత్రాలన్నిటిలోకి ఉత్తమమైనది. ఎందుకంటే ఇది వాస్తవ సంఘటనల యధాతథ దృశ్యకావ్యం. ఈ దేశంలోని మహోన్నత మేధావి అయిన ఒక గొప్ప వ్యక్తి గురించి దర్శకులు జబ్బార్ పటేల్ ఉన్నతమైన విలువలతో, అత్యంత కళాత్మకంగా దృశ్యీకరించారు. దీన్ని భారతదేశ భాషలన్నిటిలోకి డబ్ చేశారు.

1913–1917 సంవత్సరాల మధ్య అమెరికా, లండన్‌లలో అంబేద్కర్ చదువు– ఆయన ప్రజ్ఞా పాటవాలను ఈ చిత్రం చూపిస్తుంది. అంచులకు నెట్టబడిన మహర్ కులంలో జన్మించిన భీంరావు అనే అతను అతి నికృష్టమైన పరిస్థితులలో జీవిస్తూ, చదువు అనే ఒకే ఒక ఆయుధం ద్వారా లక్షలాదిమందిని విముక్తి వైపుకి దిశానిర్దేశం చేశాడు. ఆ సంఘటలన్నిటినీ చిన్నచిన్న బిట్స్‌తో సహా ప్రతి ఫ్రేమ్‌నీ, నిన్న మొన్న జరిగినట్లు హృద్యంగా, ప్రభావశీలంగా ప్రేక్షకుల అనుభవంలోకి తేగలిగిన జబ్బార్ పటేల్ సామర్ధ్యం బహు కష్టతరమైనదే గాక గొప్ప మేధావితనంతో కూడుకున్నది. ఈ సెట్లు ముఖ్యంగా మార్కెట్ ప్రాంతం, ఢిల్లీలోని భారత పార్లమెంట్, రైల్వే స్టేషన్, అప్పటి వాహనాలు, టాంగాలు మొ.న దృశ్యాలు అద్భుతంగా ఉన్నాయి. అమెరికా కొలంబియా యూనివర్శిటీ, లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్, బొంబాయి, ఇలా ప్రతి సన్నివేశాన్నీ వాస్తవికంగా ఆయా లొకేషన్స్ కెళ్ళి చిత్రీకరించారు. ఆ యా సంఘటనల్ని కూడా చారిత్రకంగా నిజాలని సెన్సార్ వారి ఎదుట తన నిజాయితీని నిరూపించుకున్నానని ప్రీతిష్ నంది కిచ్చిన ఇంటర్వ్యూలో జబ్బార్ పటేల్ చెప్పారు. ఈ సినిమా వచ్చినప్పుడు పోస్టర్‌లో "గొప్ప వ్యక్తులు చరిత్రను సృష్టించారు. ఒక్క వ్యక్తి దానిని మార్చారు – డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్"

అనే కొటేషన్ చూచి అంబేద్కర్ మిత్రులలో ఒకరు అమితంగా ప్రభావితుడై లెక్కలేనన్ని సార్లు సినిమా చూశారట!

ఆధునిక డాక్యుమెంటరీల పితామహులు జాన్ గ్రీగర్ సన్ "ముడి జీవితం నుండి తీసుకున్న గాథలు, దృశ్యాలు నటించిన కృత్రిమ సన్నివేశాల కన్నా ఎన్నో రెట్లు మెరుగు అని మేము నమ్ముతున్నాం. సహజ సుందరంగా ఎలాంటి బిగింపులు లేకుండా ప్రకటితమయ్యే భావ సంకేతానికి తెర మీద ఓ ప్రత్యేక విలువ ఉంది. టక్కుటమార విద్యలు మిళాయించి స్టూడియో కర్మాగారాల్లో తయారు చేసే యాంత్రిక ఉత్పాదనలు ఇవ్వలేని, వాటికి అతీతమైన ఆత్మీయ అనుభూతినీ, తెలివిడితనాన్ని ఇవ్వగల శక్తి ఒక్క డాక్యుమెంటరీకే ఉంది" – అని డాక్యుమెంటరీ దృశ్యీకరణ గురించి అన్నారు. ఇది భారత సమాజ వాస్తవికతతో పెనవేసుకుని ఉంది కాబట్టి, జాన్ గ్రీర్‌సన్ చెప్పినట్లే అంబేద్కర్‌తో సహా కుల వివక్షకూ, అన్ని రకాల పీడనలకూ గురవుతున్న మనుషులందరి వాస్తవ జీవిత గాథల సారాంశాన్ని అద్భుతంగా ఆవిష్కరించారు జబ్బార్ పటేల్.

అంబేద్కర్ సర్వోత్కృష్టమైన రచనగా ప్రఖ్యాతి గాంచిన "కుల నిర్మూలన" (The Annihilation of Caste) కమ్యూనిస్ట్ మ్యానిఫెస్టోకి సమానమైన ప్రాధాన్యతను సంతరించుకుంది. వేలాది పేజీల రచనలతో, ప్రసంగాలతో గాక కుల వివక్షను అంతం చెయ్యాలని అంబేద్కర్ తన జీవితమంతా ఎడతెగని యుద్ధం చేశారు. స్వాతంత్ర్యోద్యమం కంటే కూడా అంబేద్కర్ కుల నిర్మూలనే ప్రధానమనుకున్నారు. గాంధీజీ పెద్ద ఎత్తున బ్రిటీష్ వస్త్రదహనం చేశారని ఒక స్నేహితుడంటే, "గాంధీజీ దహనం చెయ్యాల్సిన విషయాలింకా చాలా ఉన్నాయి. ఇండియాలో కోట్లమంది అంటరానివారు, పౌర హక్కులు, న్యాయహక్కులు, రాజకీయ హక్కులు, నైతిక హక్కులు లేకుండా ఉన్నార"ని అంబేద్కర్ అంటారు. మహర్ కులంలో జన్మించిన కారణం వల్ల అపారమైన విద్వత్తుతో దేశానికే గర్వకారణమైన అంబేద్కర్‌కి ఇంకో మనిషి తోడు లేక, తల దాచుకునే చోటు లేక బరోడాలో ఎంత క్షోభ ననుభవించారో ఆయనే స్వయంగా రాసుకున్నారొకచోట. ఆయన బాల్య సంఘటనలూ, బరోడాలో జరిగిన అవమానం అంబేద్కర్‌ని నిరంతరం బాధతో మెలితిప్పుతూ జీవితాంతం ప్రభావితం చేశాయి. ఈ దేశం పరిస్థితి ఒకప్పుడు, ఆ మాటకొస్తే ఇప్పుడైనా ఎంత నీచంగా ఉందో, ఈ కుల వ్యవస్థ తోటి మనుషుల పట్ల ఎంతెంత హీనంగా, నీచంగా ప్రవర్తించిందో ప్రతి ఒక్కరూ తెలుసుకుని తీరాలి.

స్టీవ్, అంబేద్కర్ హొటల్లో పని ముగించుకుని బయటి కొచ్చేసరికి ఒక తెల్లవాడు, నల్లజాతీయుణ్ణి పట్టుకుని 'నల్లజాతి వెధవా, మా తెల్లజాతి అమ్మాయిని ముట్టుకోవడానికి నీకెంత ధైర్యంరా? నల్లజాతి నక్క, అంటరాని కుక్క బూడిదలో పొర్లే పందికీ నీకూ తేడా లేదు కదరా' అంటూ నోటికొచ్చినట్లు తిడుతూ, విచక్షణా రహితంగా రోడ్డు మీద పడేసి ఎడా పెడా చావబాదుతుంటారు. ప్రేక్షకులకు ఇటీవల అమెరికా పోలీసులు జార్జ్‌ఫ్లాయిడ్‌ని కిరాతకంగా చంపిన దృశ్యం కళ్ళెదురుగా నిల్చి అప్పటికీ, ఇప్పటికీ పరిస్థితి ఏమాత్రం మారకపోగా ఇంకా హీనమై పోయిందనిపించి నీరస పరుస్తుంది. అగ్రరాజ్యపు చెడుపోకడలే అందరికీ ఆదర్శమవు తున్నాయి!

'చలో మహాడ్, అస్పృశ్యత నశించాలి' అనే స్లోగన్లతో జనసమూహం మహోద్రేకంతో కదిలిపోతుంటుంది. కుటుంబ సమేతంగా పిల్లలూ, వృద్ధులూ, అన్ని వయసుల స్త్రీ-పురుషులతో మహోద్రేకంతో కదిలిపోతున్న ఈ జనసమూహాలు ఐసెన్ స్టీన్ సినిమాలు "స్ట్రైక్", "బ్యాటిల్‌షిప్ పొటోంకిన్", "అక్టోబర్" చిత్రాల్లోని జన ప్రవాహాల్ని గుర్తుకి తెస్తుంది!

భారతదేశ చరిత్రలో అంబేద్కర్ ఒక గొప్ప మేధావి, అధ్యయనశీలి. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ లైబ్రరీలో ఒక మనిషి చేతులతో పట్టుకోలేనన్ని గ్రంధాలను కిందా, మీదా పడేసుకుంటూ తనున్న చోటుకి మోసుకు రావడం కనిపిస్తుంది. ప్రపంచంలోని కీలకమైన గ్రంధాలు, అందులో ఏ పేజీలో ఏముందో కూడా చెప్పగలిగిన దిట్ట ఆయన! పాఠక రాక్షసుడే గాక పని రాక్షసుడు కూడా! అంత ప్రత్యేకమైన అంబేద్కర్‌ని అంతే ప్రత్యేకంగా ప్రేక్షకుల ముందు బొమ్మ కట్టించారు జబ్బార్!

సినిమా చూసే ప్రేక్షకులకి తొలి ప్రతిస్పందన కలిగించడం చాలా ముఖ్యం. మొదటి సన్నివేశంలోనే ప్రేక్షకునికి కథావస్తువుకు సంబంధించీ సూచీప్రాయమైన సంకేతం అందాలి. ఆ పనిని అద్భుతంగా చేశారు దర్శకులు జబ్బార్ పటేల్! అంటరాని వారి దయనీయమైన స్థితిని ప్రేక్షకుల మదిలో ముద్రించడానికి వారిని మానసికంగా సంసిద్ధంగా చెయ్యడానికి పెన్సిల్ స్కెచ్‌ల ద్వారా ప్రదర్శించాలనే జబ్బార్ పటేల్ అద్భుతమైన ఆలోచన ఈ చిత్రానికి ఉత్తమోత్తమంగా హైలైట్‌గా నిలిచింది!

ఇక నటీ నటుల గురించి చెప్పాలంటే 'మమ్ముటీ' అయితే అంబేద్కర్ ఉద్వేగాలనూ, సంయమనాన్నీ, అంతఃకరణనూ అభినయించడంలో అతని కతనే సాటిగా పాత్రలో జీవించారు. ప్రపంచ మేటి నటుల కోవలో చేరిపోయారు. ఆయన అద్భుతమైన నటనా సామర్థ్యాలు అంబేద్కర్‌ను భౌతికంగా చూడని వారందరికీ తిరిగి జీవితంలోకి తీసుకువచ్చి కళ్ళముందు ప్రత్యక్షం చేస్తాయి! అంబేద్కర్ భార్య రమాబాయిగా నటించిన 'సోనాలీ కుల్‌కర్ణి' కూడా అద్భుతంగా నటించారు. అంబేద్కర్ సామాజిక జీవితం కంటే వ్యక్తిగత జీవితాన్ని చాలా తక్కువగా చిత్రించినప్పటికీ వాళ్ళిద్దరికీ చాలా అన్యోన్య దాంపత్యమనీ, కష్టసుఖాల్ని కలిసి పంచుకుంటారనీ నలుగురు బిడ్డలు చనిపోయిన దుఃఖాన్ని వారు భరించిన తీరు ద్వారా వ్యక్తమవుతుంది. రాజ్యాంగ రచన పని ఎక్కువగా ఉండటం, తీవ్రమైన అనారోగ్య పరిస్థితుల్లో ఆయన్ని సానుభూతితో చూసుకుంటారని ఆమె అంగీకారంతోనే డాక్టర్ సవితా కబీర్ ని వివాహం చేసుకుంటారు. సవితగా నటించిన 'మృణాల్ కుల్‌కర్ణి' కూడా అంబేద్కర్ ఆరోగ్యమే తన జీవిత ధ్యేయమన్నట్లుగా పాత్రలో ఒదిగిపోయారు.

స్క్రీన్‌ప్లే రచయితలు దయా పవార్, అరుణ్ సాధు, సూని తారా పోరేవాలా ఎంతైనా ప్రశంసనీయులు! ఈ చిత్రంలోని అంబేద్కర్ సంభాషణలను ఆయన రాసిన రచనల నుండి తీసుకుని శక్తివంతంగా స్క్రిప్ట్‌ను రూపొందించారు. అందువల్ల మమ్ముట్టి మాట్లాడేటప్పుడు ఆయన స్వరంలో ప్రామాణికత ధ్వనిస్తుంది. ఈ ప్రసంగాలు ఒక తరం రాజకీయ ఆలోచనాపరుల్ని ఎంతగా ప్రభావితుల్ని చేశాయో అర్థమవుతుంది. 'నితిన్ చంద్రకాంత్ దేశాయ్' కళా దర్శకత్వం కూడా బ్రహ్మాండంగా అమిరింది. కాస్ట్యూమ్ డిజైనింగ్ ద్వారా అంబేద్కర్ అభిరుచి ప్రేక్షకులకు చక్కగా తెలిసేలా రూపొందించారు. సంగీతాన్ని అందంగా సందర్భానుసారంగా సమకూర్చారు.

అస్పృశ్యులైన ప్రజల జీవితాలను మెరుగు పరచాలని అంబేద్కర్ అహర్నిశలూ ఎంతో ప్రయాస పడతారు గానీ అదంత సులభం కాదని ఈ చిత్రం చూపిస్తుంది. మహారాష్ట్రలోని భీమా కోరెగావ్ వద్ద దళితులపై జరిగిన దాడి కుల అణచివేతలతో పాటు, అనేక రకాలైన ఘోర పరిణామాలను నేడు మనం చూస్తున్నాం. ప్రతి సంఘటనా అంతకు ముందు దానికంటే దిగ్భ్రాంతికరంగా, దౌర్జన్యపూరితంగా,

హింసాత్మకంగా మారుతుంది. ఈ చిత్ర ప్రారంభ దృశ్యం ఈ సత్యాన్ని స్పష్టంగా ప్రదర్శిస్తుంది. అంబేడ్కర్ జ్ఞానాన్ని విదేశీయులందరూ ప్రశంసిస్తారు గానీ స్వదేశీయులు మాత్రం అతను తన జీవితంలో ఎంత ఎత్తుకు చేరుకున్నా, అతన్ని నిరంతరం 'అంటరాని మహర్ కులస్థుడ'ని అవమానపరుస్తూ తీవ్రమైన అణచివేతకు గురి చేస్తారు! బరోడా దృశ్యం ప్రేక్షకుల మనసుల్ని కలచివేస్తుంది. విషాద మేఘాలు అలుముకున్న ప్రతిసారీ ఆయన సంగీతంతో స్వాంతన పొందడం చూస్తారు ప్రేక్షకులు. భవిష్యత్తులో చరిత్రకారులు గనక నా జీవితాన్ని సమీక్షిస్తే అప్పుడు నేను దేశానికి చేసిన సేవలను ప్రజలు గుర్తిస్తారు అని ఆవేదనతో అన్నారు అంబేడ్కర్. ఇది ప్రజాస్వామ్య సంక్షేమ రాజ్యమని మర్చిపోయి వ్యక్తిపూజ ప్రబలిపోతున్న ఈ సంక్షోభ కాలంలో అంబేడ్కర్ మహనీయుని ప్రాసంగికత మరీ మరీ అవసరం! అందుకోసమైన అందరూ ఈ చిత్రాన్ని తప్పక చూడాలి.

**అవార్డులు**

1999లో "డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్" – ఉత్తమ చలనచిత్రంగా, మమ్ముట్టి – ఉత్తమ నటుడిగా, ఉత్తమ కళాదర్శకత్వానికి నితిన్ చంద్రకాంత్ దేశాయ్ జాతీయ చిత్ర అవార్డును గెలుచుకున్నారు.

70వ భారత స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకుని ఇండియన్ డైరెక్టరేట్ ఆఫ్ ఫిల్మ్ ఫెస్టివల్స్, రక్షణ మంత్రిత్వ శాఖ సంయుక్తంగా సమర్పించిన స్వాతంత్ర్య దినోత్సవ చలన చిత్రోత్సవంలో ఈ చిత్రం ఆగస్టు 15, 2016 న అంబేడ్కర్ స్మృతిలో ప్రదర్శించబడింది.

***

"కులం పునాదుల మీద మీరు దేనినీ నిర్మించలేరు. ఒక జాతినీ నిర్మించలేరు. ఒక నీతినీ నిర్మించలేరు. కులం పునాదుల మీద మీరు ఏదైనా నిర్మిస్తే అది పగిలి ముక్కలు కావడం తప్పదు. అట్టిదేదీ ఒక సంపూర్ణ నిర్మాణంగా మనజాలదు."

# 13. కుల నిర్మూలన చేద్దాం.. రండి కదలిరండి..

– డా. యమలా సుదర్శనం, ఎడిటర్, దళిత శంఖారావం, మదనపల్లి.

కుల నిర్మూలన గురించి చర్చించే ముందు నేటి సమాజంలో కుల పెత్తనం, క్రింద అణగారిన కులాలు ఎలా అవమానకరమైన బ్రతుకులు బ్రతుకుతున్నాయో తెలుసుకుందాము. అందులో భాగంగా నా స్వీయ అనుభవాలు కొన్ని తెలుసుకుందాము. కుల వ్యవస్థలో క్రింది కులాలు ఎలా హీనమైన జీవితాలు గడుపుతున్నాయో ఒకసారి తెలుసుకొంటే కనీసం నేటి యువత అటువైపుగా బాబా సాహెబ్ వైపు ఆలోచిస్తారని ఆశిద్దాం.

అది 1969 సం. అప్పుడే నేను పదవ తరగతి పరీక్షలు రాసి ఇంటి వద్దవున్నాను. మా తండ్రి వ్యవసాయ కూలి. తల్లి కూడా ఆయనతో పాటే కూలి పనులకెళుతుంది... నన్ను మా మేనమామ వెంట కొయ్యపనికి పంపారు. ఒక సిమెంటు గోతాములో సామాన్లు వేసుకొని గ్రామాల్లో ఎక్కడ పని వుంటే అక్కడికి వెళ్ళేవాళ్ళము. ఒకరోజు పనిచేస్తూ మధ్యాహ్న భోజన సమయానికి భోజనానికి వెళితే రైతు భార్య ఇంటి బయట అన్నం పెట్టి, చెంబు తెచ్చుకో నీళ్ళు పోస్తానని చెప్పగా నేను నివ్వెరపోయాను. అప్పటి వరకు హాస్టల్లో స్కూల్లో అంటరాని తనము తెలిసేది కాదు. నన్ను చాల బాధించింది. ఆరోజే పని మానుకొన్నాను. గడి అనే ఊరు మాకు సమీపాన వుంది. అక్కడ టీ దుకాణము వుండేది. మా వూరి టీచరు కొడుక్కి కప్పుల్లో టీ ఇచ్చి నా వరకు వచ్చేసరికి చూరులో వున్న రెండు గ్లాసుల్లో ఒకటి తీసుకోమన్నాడు. టీ తాగకుండా వారం తిరక్కనే గుడిసెకు నిప్పుపెట్టాము.

1980 ప్రాంతంలో కలికిరిలో రైతు కూలి ఉద్యమం జోరందుకొంది, నేను రాష్ట్ర ఉపాధ్యక్షుడిగా గంజి రామారావుగారు అధ్యక్షులుగా వుండేవారము. ఒకనాడు కలికిరి క్రాస్‌లో ధర్నాచేసి వచ్చి మండుటెండలో నీళ్ళకోసం సమితి ప్రెసిడెంట్ ఇంటికెళితే, యజమానురాలు “నువ్వు రత్నప్ప అల్లుడవే కదా? నీ మామ చెంబు అక్కడ వుంది తెచ్చుకో నీళ్ళు పోస్తా”నని లోనికి వెళ్ళింది. ఆమె వచ్చేలోగా బయటికి వచ్చేశాను. ఈ ప్రజాస్వామ్య దేశంలో ఇంకా అంటరానితనం ఉందా అని ఆవేదన చెందాను.

ఇప్పటి తరం వాళ్ళు కులం ఎక్కడుంది అందరము కలసిపోయాము కదా అని ఊకదంపుడు సొల్లు కబుర్లు చెబుతున్నారు. డెబ్బది నాలుగు వత్సరాల

స్వాతంత్ర్యంలో కుల పెత్తనం, అస్పృశ్యతా పోలేదు. అయితే రూపము మార్చుకొంది. మనం పనివుండి అగ్రకులాల ఇంటికెళితే ఎక్కడ మనం లోపలికి వెళతామోనని మనకంటే ముందుగా ఇంటి బయట వరండాలో కుర్చీ వేసి మనల్ని ఆప్యాయతగా పలకరిస్తారు. ఇది కుల వివక్షత కాదా? అస్పృశ్యత వాసనలు ఎక్కడపోయాయి? అంతెందుకు పెద్దలు రాష్ట్రపతిగారు ఈ దేశపు ప్రథమ పౌరుడు రాష్ట్రపతి రాజస్థాన్ వెళ్ళి దేవాలయములో పూజలు చేయాలంటే అర్చకులు గుడి తలుపులు మూయడం మనకందరికి తెలిసిందే. మరి వారు "ఇందు గలడందులేడు సర్వేశ్వరుడు ఎందెందువెతకినా" అని మెట్లపైనా పూజా కార్యక్రమం ముగించుకొని రాలేదా. దీన్నేమంటారు. రామ మందిరం నిర్మాణపూజలో మన దేశ ప్రథమ పౌరుడికి ఆహ్వానం లేదా కారణం అంటరానివాడనేనా? ఈ సంఘటనలు కొన్ని మచ్చుకు మాత్రమే. రోజురోజూ అంటరానివారి పైన దాడులు, హత్యలు, దమనకాండలు గమనిస్తే కులం ఎంత భయంకరమైనది, ఈ కులం పునాదుల్ని ఎందుకు పెకలించరాదు అన్న ఆలోచన మనకు కలగకపోదు. అసలు ఏంటి కులం పోకడ ఎందుకు దీని నిర్మాణం రోజు రోజుకు బలపడుతుంది. దానికి కారణాలు అనేకం చెప్పవచ్చు. మాన్యులు డా॥ బి.ఆర్. అంబేద్కర్ ఆయన ఉపన్యాసాలలోనూ, రచనలలోనూ ఇలా అంటారు, "హిందూమతం ఉన్నంత వరకు కులం పోదు" అయితే నేటి అంబేద్కర్ వాదులు ఈ కులాన్ని నిర్మూలించడానికి ఏం ప్రయత్నాలు చేస్తున్నారో తెలియడం లేదు. అసలు మనం వీళ్ళను పరిశీలిస్తే విచారకరమైన విషయాలు మనకు తెలుస్తాయి. సభల్లో జైభీం చెప్పి, అంబేద్కర్ ఆలోచనే మనకు శరణ్యమనే ఈ నాయకులు నిజ జీవితంలో అంబేద్కర్‌ను ఒక భుజం మీద మరొక భుజాన ఏసునాథున్ని, లేదా వెంకటేశున్ని, అయ్యప్పనో రామున్నో కృష్ణున్నో తెగ మోస్తున్న విధానం మనం చూస్తూన్నాము. వీరి ఇండ్లలో ప్రారంభంలోనే బాబా సాహెబ్ చిత్రపటం వుంటుంది. లోన పూజా గది దాన్లో వారి దైవాల బొమ్మలు పూజింపబడుతుంటాయి. ఇక వీళ్ళు గృహప్రవేశ కార్యక్రమానికి ఆవులేనిదే అర్చకుడు లేనిదే యజ్ఞం చేయనిదే గృహప్రవేశ కార్యక్రమం జరగదు. పెళ్ళిళ్లకు బ్రాహ్మణుడు రావాలి మంత్రాలు చదవాలి. ఇది ఈనాటి అంబేద్కర్ వాదుల ముఖ చిత్రాలు. ఇది ఎలా వుందంటే హరిదాసు కథ చెపుతూ ఎర్రగడ్డ తినకండి అని చెప్పి ఇంటికెళ్ళి భార్య కూరలో ఎర్రగడ్డ వేయనందుకు ఎందుకు వేయలేదని ప్రశ్నిస్తే తమరు ఎర్రగడ్డ తినవద్దని కథలో చెప్పారు కదా అని ఆవిడ జవాబిస్తే ఎర్రిదానా! చెప్పింది వాళ్ళకు ఇది మనకు వర్తించదని బుకాయిస్తాడు ఇలా వుంది మన అంబేద్కర్ వాదుల

విషయం. ఆదివారం చర్చికి, సోమ శనివారాలు దేవాలయాలకు వెళ్ళడం మన వాళ్ళకు పరిపాటైంది. వీళ్లే మొదటగా అయ్యప్పమాలలు ధరిస్తారు, భజన సంఘాలలో రహస్య సభ్యులుగా వుంటారు. అసలు ఈ క్రిందికులాలే హిందూ మతాన్ని పెంచి పోషిస్తున్న విషయం మనం గుర్తుంచుకోవాలి. మనం ఇంకా గమనిస్తే మహానుభావుడు డా॥ బి.ఆర్. అంబేడ్కర్ కృషి వల్ల వారు రచించిన రాజ్యాంగం వల్ల నేడు శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు మన వాళ్ళు కాగలిగారు. వారు ఇప్పుడు కూడా పార్లమెంటులో శాసన సభలో తమకు నచ్చిన విధంగా తమ వాదనను వినిపించగలరా, తన జాతికి అవమానం జరిగినప్పుడు, అత్యాచారాలు జరిగినప్పుడు దానిపై సభలో జీరో అవర్‌లో చర్చకు అవకాశం కల్పించమని చెప్పగలరా? మనకు మనం ప్రశ్నించుకొంటే లేదు అనే జవాబు వస్తుంది.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో కంచక చర్ల కోటేష్‌ను చెట్టుకు కట్టి కాల్చిన కేసు అసెంబ్లీలో చర్చకు వచ్చినప్పుడు పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి వ్యవసాయ శాఖామాత్యులు దొంగతనం చేస్తే చంపక ముద్దెట్టు కుంటారా అని అనగానే మాన్యులు ఈశ్వరీబాయి గారు ఆర్.పి.ఐ. నాయకులు చెప్పు తీసుకొని ఆ పెద్ద మనిషిని అసెంబ్లీ చుట్టూ నాలుగు రౌండ్లు చెప్పు పట్టుకొని తరిమింది. గౌరవ ఈశ్వరాబాయిగారు ఆత్మాభిమానం కలిగినవారు. నేడు డా॥ సుధాకర్‌ను పిచ్చివాడిని గా చేసినా, జడ్జి రామకృష్ణపై దాడి జరిగినా గోల్డు మెడలిస్టు డా॥ అనితారాణి గారిని అవమానం చేసినా, ఎలిచర్ల సుధాకర్‌ను చంపినా, ప్రసాద్‌కు శిరోముండనం చేసినా, దళిత యువతిని గాంగ్ రేప్‌చేసి స్టేషన్ ముందు పడేసినా, పుంగనూరు గూడురు వారి పల్లెలో మైనరు బాలికను రేప్ చేసినా, ఓం ప్రకాష్ ఆత్మహత్యకు గురైనా ఈ సంఘటనలన్నిటికీ మన ప్రజా ప్రతినిధులకు చీమ కుట్టినట్టయినా లేదు. దీని కంతటికి కారణం అధికార దాహం. అంబేడ్కర్ ఆలోచనా విధానాన్ని అవకాశం కోసం వాడుకోవడము.

ఇది ఇలా వుంటే అసలు కుల నిర్మూలన కావాలని ఏడు దశాబ్దాల నుండి మనం అంటూనే వున్నాము. ఆచరణలో ఒక్క అడుగు కూడా ముందుకు పోలేకపోతున్నాము. అసలు హిందూమత తాత్వికతను మనం ప్రశ్నిస్తున్నామా? అసలు ఏంటి దాని ప్రత్యేకత అన్నప్పుడు... మనువు అనే దుర్మార్గుడు మనువాదాన్ని బలవంతంగా మన నెత్తిన రుద్దాడు. బ్రాహ్మణుడు శిరసు నుండి, క్షత్రియుడు భుజాల

నుండి, వైశ్యులు తొడల నుండి, శూద్రులు పాదాల నుండి జన్మించారట. ఇక అస్ప్రశ్యులు ఎలా పుట్టింది చెప్పలా, ఇది సాధ్యమా? మనిషి పుట్టుక ఎలాగన్నది అందరికీ తెలిసినదే కదా. మరి ఈ వితండ వాదనను బ్రాహ్మణులు భుజాన వేసుకొని వర్ణాశ్రమ ధర్మాలను ప్రచారం చేసుకొంటూ, ఇంకా ఇలా అంటాడు. సర్వ ప్రపంచము దేవుని ఆధీనములో వున్నది, ఆ దేవుడు మంత్రము యొక్క ఆధీనములో వున్నాడు, ఆ మంత్రము బ్రాహ్మణుడి ఆధీనములో వున్నది. దీంతో బ్రాహ్మణుడి ఆధిక్యత ఈ విధంగా కూడా చాటుకొంటున్నాడు. పంచములను హీనులని, మ్లేచ్ఛులని, ఊరికి దక్షిణ దిక్కున నివసించాలని, వీరు సొంత భూమి కలిగి యుండరాదు, మంచి బట్టలు వేసుకోరాదు, చినిగినవి, పై కులాల వారు తిరిపంగా ఇచ్చినవి వేసుకోవాలి. పేర్లు సహితం హీనతను కలిగించే పేర్లు పెట్టుకోవాలి. పై కులాలు పెట్టే మెతుకులు తినాలి. బజారు వెంట పోవాలంటే మూతికి ముంత, చేతిలో చీపురు గంట ధరించాలి. రాజవీధిలో (ప్రధాన వీధిలో) నడిచేటప్పుడు తన కాలి అడుగులు అగ్రకులాల వారు తొక్కకుండా వూడ్చుకుంటూ పోవాలి. ఉమ్మివస్తే ముంతలో ఉమ్మివేయాలి, అంటరానివాడిని వస్తున్నాను వైదొలగండి అంటూ గంట మ్రోగించాలి. ఇది మనుధర్మశాస్త్ర విధానము. పీష్వాల కాలంలో ఇది చట్టరూపం దాల్చింది. దీన్ని ఎవరూ కాదనటానికి వీలులేదు. అంటరానివారు, స్త్రీలు విద్య నేర్చుకోరాదు, వేదాలు చదవరాదు. చదివితే నాలుక కోయాలి, వింటే చెవిలో సీసము పోయాలి. ఇలాంటి దుర్మార్గమైన శాసనాలు చేసి పంచముల, మూలవాసీ జనాలను అంటరానివారిగా హీనాతిహీనంగా చూశారు. వీరు పై కులాల వారికి సేవలు చేయాలి. సేవలకు ఎలాంటి ప్రతిఫలం అడగరాదు. ఈ విధానాన్నే మొన్నమొన్నటి వరకు తెలంగాణాలో మన రాష్ట్రములో అక్కడక్కడ అమలులో వుండేది. దీనికి ప్రధాన కారణం హిందూమతం ఈ నిచ్చెనమెట్ల సమాజాన్ని నిర్మించినది. కుల వ్యవస్థను కాపాడుకొంటూ దానికి రామాయణ, భారత వేదాలను ఆచారాలను చూపుతున్నది. రామాయణంలో రాముడు ఏనాడు నీతిని అమలు చేయలేదు. రావణాసురుడి చెల్లెలు శూర్పణక రాముడ్ని చూసి ప్రేమించానని అనగా రాముడు మహిళ అన్నభావనే లేకుండా ముక్కు చెవులు కోయించాడు, శంభూకుడు తపస్సు చేస్తున్నాడన్న నెపంతో శూద్రుడైనందుకు చంపేశాడు. భారతములో ఆస్తి వివాదములో మొత్తము నడుస్తుంది. యుద్ధము నడుస్తుంది. యుద్ధము మొత్తంగా అధర్మ యుద్ధము. శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధించే గీత మొత్తం వివాదాస్పదం. ఇక వేదాలు అశాస్త్రీయ రచనలు, అభూత కల్పనలు, ఇవన్నీ ఈ కుల వ్యవస్థను బ్రాహ్మణవాదాన్ని నిలబడడానికి మూల

కారణాలు. అందులో ప్రధానంగా కర్మ సిద్ధాంతం. ఈ కర్మ సిద్ధాంతం గీత నుండి ప్రచారం అయినది. ఇవ్వాళ అంటరానివారు తమ అంటరాని తనానికి కారణం గత జన్మలో తాము చేసిన పాపమని బ్రాహ్మణులు చెబితే దాన్నే నమ్ముతున్నారు. డా॥ బాబాసాహెబ్ ఈ బ్రాహ్మణ పిచ్చ వేదాల్ని చీల్చి చెండాడాడు. రాముడు కృష్ణుని బాగోతాలను బట్టబయలు చేశాడు. కుల నిర్మూలనా అవసరాన్ని నొక్కి వక్కాణించాడు. తాను 1935 సం॥లో జాత్ పాత్ తోడక్ మండలి బహిరంగ సభకు తయారుచేసి అధ్యక్షోపన్యాసములో మొత్తం కుల సమస్యను, దాని తాత్వికతను ఎండకట్టారు, “కులం అనేది కొన్ని మత విశ్వాసాల కారణంగా ఏర్పడిన వ్యవస్థ. ఆ మత విశ్వాసాలకు శాస్త్రాల మద్దతు ఉంది. ఆ శాస్త్రాలు దైవ సమానులైన ఋషులచే ప్రతిపాదించబడి నట్టివనే ప్రతీతి ఉండేది. ఆ ఋషులు మానవాతీత శక్తులు గలవారని మహాజ్ఞానులని, అట్టివారి ఆదేశాలను ధిక్కరించడం మహా పాపమని, ప్రజలకు ఒక నమ్మకం ఉంది. అందువల్ల కుల వ్యవస్థను వదులుకొమ్మని కోరడము వారి ప్రాథమిక భావాలకు విరుద్ధంగా వారిని నడుచుకోమనడమే”. అంతే కాకుండా కుల నిర్మూలన చాలా మహత్తరమైన పని. చాలా వరకు అసాధ్యమైన పని కూడా కావచ్చు. హిందువులు తమ సామాజిక వ్యవస్థను పరమ పవిత్రంగా భావిస్తారు. కులానికి దైవిక ప్రాతిపదికను ఆపాదిస్తారు. అందువల్ల మీకు కులాన్ని నిర్మూలించాలంటే దానికి ఆధారంగా కల్పించబడ్డ దైవికతను, పవిత్రతను ముందు నిర్మూలించవలసి ఉన్నదన్నమాట.” ఆ పవిత్రత వారు సోకాల్డు వేదాలను రామాయణ భారతాలను ఉదాహరణ చూపుతారు. మనం భేషుగ్గా తలవంచుతాము. ఇక్కడ శాస్త్రీయ దృక్పథం మన వారిలో లేకపోవడం, డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్‌ను, జ్యోతిభా ఫూలేను, నారాయణ గురూను, సంత్ రవిదాస్, పెరియర్‌ను, అర్థం చేసుకోకపోవడం, ప్రధానంగా చదవకపోవడం కారణం. చదివినా అవగాహనా లోపం, చదువులేని అయ్యంకాళీ పోరాటాలు ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోవాలి. కేరళలో బహిరంగ సభను కేరళ భూమిమీద పెట్టరాదని పాలకులు పర్మాణా తెస్తే అయ్యంకాళీగారు నదిలో పడవల పైన సభలు నిర్వహించారు. తను చదవకపోయిన పాఠశాలలు, పత్రికలు పెట్టారు. జాతి జనాన్ని చైతన్యం చేశారు. నారాయణగురు, బసవడు కుల వ్యవస్థపైన జరిపిన పోరాటాలు, పెరియార్ దేవాలయాల పైన మతం, దేవుళ్ళపైన చేసిన పోరాటాలు, ఇవన్ని కుల నిర్మూలనలో భాగమే. డా॥ బాబాసాహెబ్ కులాంతర వివాహాలను ప్రోత్సహించాడు. జ్యోతిబా ఫూలే తన భార్య సావిత్రీబాయి ఫూలే గారికి చదువు చెప్పి ఉపాధ్యాయురాలిగా చేసి మహిళా విద్యకు అంకురార్పణ

చేశారు. బాబాసాహెబ్ పాఠశాలలు, హాస్టళ్ళు, ఎడ్యుకేషన్ క్లబ్బులు, విశ్వ విద్యాలయాల్ని స్థాపించి జాతిని చైతన్యవంతుల్ని చేయాలని ఉబలాట పడ్డారు.

అయితే మనం కులాలుగా, తెగలుగా, విడిపోయి రాజకీయ పార్టీల జెండాలు మోసేవాళ్ళుగా, దుళారులుగా, సెటిల్‌మెంటు చేసేవాళ్ళుగా తయారైనాము. ఇకనైనా జగరూకతతో జాతి జనాన్ని చైతన్యం చేయాలి. హిందూ సమాజాన్ని సంస్కరించడమంటే కుల వ్యవస్థను రద్దు చేయడం. ఇక్కడ కుల ప్రభావం మత ప్రభావం గమనిస్తే సామాన్య మానవుడి మీద ఒక మెజిస్ట్రేటు కంటె మతాచార్యుడు ఎక్కువ అధికారాన్ని చెలాయించగలిగిన భారతదేశంలో మతమే అధికారానికి మూలభూతం అనేది సర్వవిధితం. అంతే కాకుండా హిందూతత్వం యొక్క పునాదిని మనం దహించకుండా కుల నిర్మూలన జరగదు. హిందూ మతమంటేనే వైరుధ్యాలకు పుట్టినిల్లు. ప్రపంచమంతా మనం గమనిస్తే ఉన్నవాళ్ళు లేనివారు, తెల్లవారు నీగ్రోలుగా వున్నారు. ఆధిపత్య వ్యవస్థ రెండవది బానిస వ్యవస్థ. భారతదేశానికొస్తే ఇది వర్గ సమాజము కాదు. వర్గంలో కులం వున్నదన్న నగ్న సత్యాన్ని మనం తెలుసుకోవాలి. ఆ కుల పిశాచాన్ని పీచ మణచకుంటే భారతదేశానికి భవిత లేదు. ఇక్కడ మనమొక విషయాన్ని గమనించాలి. బానిస వ్యవస్థలో రోమ్ నగరాన్ని పరిశీలిస్తే, బానిసలకు చదువుకోవడానికి, సొంత ఇల్లు కట్టుకోవడానికి, విలువైన ఆభరణాలు ధరించడానికి, కారులో తిరగడానికి అధికారులుగా వుండడానికి ఎలాంటి అవరోధాలు లేవు. బానిస యజమాని బానిసకు నైపుణ్య అభివృద్ధికి ప్రత్యేక శిక్షణ ఇప్పిస్తాడు. న్యాయమూర్తులుగా, పోలీసులుగా, వివిధ రంగాలలో ఈ బానిసలు స్థానం యజమాని ద్వారా సంపాదించుకొనేవాడు. అయితే కుల వ్యవస్థ అస్పృశ్యులను మనుషులుగా కూడా చూడలేదు. సొంత భూమి కలిగి యుండరాదు. కట్టే బట్ట నుండి తినే తిండి, జీవన విధానం మొత్తము అగ్రకులాలు ప్రధానంగా బ్రాహ్మణ వర్గం నియంత్రిస్తుంది. చెరువులో కుక్కలు, పందులు దొర్లాడవచ్చు, కాని ఈ కడజాతివాడు ఆ నీటిని ముట్టుకోరాదు. పురవీధుల్లో తిరగరాదు. ఇలాంటి కఠిన నియమ నిబంధనాలతో అస్పృశ్యుల జీవన విధానం వుండేది. ఈ అంటరాని వారికంటే కూడా బానిసలకు అనేక హక్కులు కలిగి వుండేవారు.

కుల నిర్మూలన జరగాలంటే హిందూమతం నుండి దూరం కావాలి. మతం యొక్క ప్రభావం ఎంతగా వుందంటే రాజైనా, ప్రధానమంత్రి అయినా, సుప్రీంకోర్టు న్యాయమూర్తి అయినా బ్రాహ్మణుని కాళ్ళు మొక్కాల్సిందే. పురోహితుడు లేనిదే

లౌకిక రాజ్యమైనా కూడా ఏ పని నడవదు. ప్రారంభోత్సవము కానీ, పునాది రాయి కాని, ఏ ప్రభుత్వ కార్యాలయానికైనా బ్రాహ్మణుడు లేనిది జరగదు. ఇంతగా పాతుకుపోయిన ఈ కుల వ్యవస్థను నిర్మూలించాలంటే మరో సాంస్కృతిక విప్లవము జరగాల్సిందే. ఎందుకంటే ఈ దేశ ప్రజల మనో ఫలకాలపై మను వాదాన్ని బలంగా బ్రాహ్మణులు నిర్లజ్జగా రాశారు. దాన్ని తుడిపివేయాలంటే మొత్తం హేతుబద్ధమైన సాంస్కృతిక విప్లవం జరగాల్సిందే. దానికి ప్రధానంగా అంటరానివారే నాయకత్వం వహించాలి. దాని భూమిక అంబేడ్కర్ ఆలోచనా విధానం కావాలి. వారు రచించిన కుల నిర్మూలన శిరోధార్యం కావాలి. యువత నేడు పెడధోరణిలో నడుస్తుంది వారికైనా శిక్షణా శిబిరాలు పెట్టి శాస్త్రీయ ఆలోచనా విధానం తలకెక్కించాలి. వందలాది సంవత్సరాలుగా మనువాదానికి తలవంచిన మన జాతికి దివ్యమైన ఔషధము బాబాసాహెబ్ కుల నిర్మూలన. కుల నిర్మూలన జరగకుండా వేలాది సంవత్సరాలు గడచినా ఈ కుల పిశాచి కబంధ హస్తాల నుండి భారత జాతి బయటపడదు. ప్రధానంగా హీనమైన బ్రతుకుల నుండి అంటరాని వారు బయట పడలేరు. కులానికి ప్రధాన భూమిక హిందూమతమే, దీనికి ఒక శాస్త్రీయ పునాది లేదు. గనుకనే కుల పీచ మణచాలన్నా, కుల రహిత సమాజం ఏర్పాటు చేయాలన్నా అంటరానివారి నాయకత్వానే ఇది సాధ్యం. ఎందుకంటే గతంలో మనం గాంధీ హరిజనోద్ధరణ చూశాము, అది పైపై సంస్కరణలతో కూడినది. డా॥ బి.ఆర్. అంబేడ్కర్ విధానం సమూల మార్పులు కోరేది. కాబట్టి దళిత సంఘాలు విడివిడిగా కాకుండా ఏ సంఘానికి ఆ సంఘం తన ఉనికిని కాపాడుకొంటూ ఒక్క ఐక్యవేదికగా జె.ఏ.సి. గా ఉద్యమించాలి. గ్రామాల్లో యువతను సమీకరించాలి. వారికి శిక్షణా తరగతులు ఏర్పాటు చేయాలి. పట్టణాలలో యువత అంత సులువుగా రారు. ఎందుకంటే వారిపై అంటరానితనం పరోక్షంగా వుందే తప్ప ప్రత్యక్షంగా లేదు. వారికి గత చరిత్ర నేటి దురాగతాలు కంటికి కట్టినట్లు చెప్పాలి. వారిని ఏకీకరణ చేయాలి. ముందుగా సంఘ నాయకుల చెంచాగిరి విధానాలకు దూరం చేయాలి. రాజకీయ పార్టీలకు పాలేర్లుగా వ్యవహరిస్తున్న దళిత ప్రజా ప్రతినిధులను నిర్భంధంగానైనా బాబాసాహెబ్ బాటలోకి తేవాలి. సభలు సమావేశాలు నిర్వహించాలి. పీష్వాల కాలం నుండి మన హీనమైన బ్రతుకులకు కారణమైన మనువాదము, బ్రాహ్మణ వాదము గురించి చెప్పాలి. దళిత సంఘాలకు కుల నిర్మూలనతో పాటు రాజ్యాధికారం కూడా ప్రధాన అజెండా కావాలి. ఈ శిక్షణా తరగతుల్లో జ్యోతిబా పూలే, సావిత్రిభాయి, పెరియార్, నారాయణగురు, సంత్

రవిదాస్, బుద్ధుడు, బసవడు, వేమన, బ్రహ్మంగారు, బ్రహ్మంనాయుడు మున్నగు వారి జీవిత విధానాలు, వారు సమాజానికిచ్చిన సందేశాలను కుల నిర్మూలనకు వారు అనుసరించిన విధానాలను మనం మన శిక్షణా తరగతుల్లో వివరించాలి. అవసరమైతే రౌండు టేబుల్ సమావేశాలు, చర్చా వేదికలు, ఏర్పాటు చేయాలి. మన డప్పు కళాకారులు మనసు చేసుకొని కళారూపాల ద్వారా సాంస్కృతిక ప్రదర్శనల ద్వారా జాతి జనాన్ని చైతన్యం చేయాలి. ఇది దీర్ఘకాలిక పోరాటం ఇందులో మనకు ప్రధాన శత్రువులుగా మనువాదులు, ఎదురు నిలుస్తారు. వారు భౌతిక దాడులకు కూడా సిద్ధపడతారు. వీటన్నిటికి మనం సిద్ధపడాలి. మన పోరాటము జాతి విముక్తి పోరాటం. మనం ఈ పోరాటంలో అనేక ఎత్తుగడలు అనుసరించాలి. అంతిమ విజయం మనదే కాగలదు. కుల రక్కసి కోరలు పీకేయాలి. దాన్ని తుదముట్టించాలి.

మన డా॥ బి.ఆర్. అంబేద్కర్ మన కోసం ఒక్కడే వెనుదిరగని పోరాటం చేశారు. ఒకవైపు మనువాదులు, మరోవైపు కాంగ్రెసు నేతలు (గాంధీ, పటేల్) మరో వైపు స్వజాతీయులే ఎప్పటికప్పుడు అడ్డు పడుతూ వుంటే మొక్కవోని పట్టుదలతో అకుంటిత విశ్వాసంతో పోరాటము చేశారు. రౌండు టేబుల్ సమావేశానికి స్టీమరు ఎక్కుతుండగా తన కొడుకు మరణం విని దుఃఖించాడే గానీ తన ప్రయాణాన్ని ఆపుకోలేదు. దళితజాతి దుర్భర దుస్థితిని కళ్ళారా చూశాడు. తన దేశంలో అంటరానితనాన్ని స్వయాన అనుభవించాడు. మరి ఆ మహనీయుడు మనందరికోసం మన బిడ్డల భవిష్యత్తు కోసం సుదీర్ఘ పోరాటం చేస్తే మనం మన కోసం పోరాటం చేయలేమా? అగ్రకుల జెండాలు మోసాము, వాళ్ళ అడుగులకు మడుగులెత్తాము హీనమైన బ్రతుకులు గడిపాము. మరి మన బ్రతుకులకు విముక్తి పోరాటం చేయనక్కరలేదా, మనువాద కరాళ నృత్యాన్ని ఆపలేమా? ఆర్.ఎస్.ఎస్. మతోన్మాదాన్ని నిలువరించలేమా? ఒక్కసారి ఆలోచించి పలువురితో చర్చించి సరైన నిర్ణయాన్ని సరైన సమయములో తీసుకొందాము. అంతిమ విజయం మనదే.

**జై భీమ్!**

**అంబేద్కర్ ఆలోచనా విధానం వర్ధిల్లాలి!!**

**మతవాదం నశించాలి!**

**మానవతావాదం వర్ధిల్లాలి!!**

***

# 14. కులమొక అనాగరికత

– **ఆర్. శివకృష్ణ,** అందరూ బాగుండాలి (మానవాభ్యుదయ ఉద్యమ సంస్థ), తెనాలి.

నా అభిప్రాయం ప్రకారం భారతదేశం నాశనం కావడానికి, ఈ దేశాన్ని నాశనం చేయడానికి మూడు ముఖ్య జాడ్యాలున్నాయి.

1) కులం, 2) మతం, 3) ప్రాంతీయత

కులం : కులం కూడు పెట్టదు కానీ ప్రాణాలు తీయగలదు. ఈ ఆధునిక శతాబ్దంలో సైతం కులమనే అనాగరికతని నిలువెల్లా నింపుకునే ఉన్మాదులు ఉన్నారు. ప్రతీ దానికీ కులంతో ముడిపెట్టి చూసే ఈ మానసిక రోగులు తల్లిదండ్రులకి కాక కులానికే పుట్టామన్నట్లు భావిస్తూ, అలాగే ప్రవర్తిస్తుంటారు కూడా. భారతీయతకు కులమొక శాపం. ఈ కులతత్వం కూకటివేళ్ళతో సహా పోనిదే దేశాభివృద్ధి జరగదు.

మతం : మనిషి లేనిదే మతం లేదు కానీ ఈరోజు అదే మతం మనిషిలోని వివేకాన్ని చంపి మానవతకి పాతరేస్తోంది. ముఖ్యంగా నేడు మత రాజకీయాలు దేశాన్ని శాసిస్తూ సగటు మనిషి బతుకుని ఊపిరాడకుండా చేస్తున్నాయి. మతోన్మాదాన్ని తుదముట్టించకుండా దేశ ప్రగతి సాధ్యం కాదు.

ప్రాంతీయం : దేశ సమగ్రతను దెబ్బతీసే ప్రాంతీయతా పిచ్చి ప్రమాదకరం. ఎవరి ప్రాంతంపై వారికి అభిమానం ఉండటం సహజం. ఐయితే, అది దురభిమానంగా మారి ఉన్మాదం కారాదు. రాజకీయ ప్రయోజనాల కోసం రంగులు మార్చే స్వార్ధ నాయకుల కారణంగా పెచ్చరిల్లే ఈ ప్రాంతీయతా ద్వేషాగ్నులు దేశ సార్వభౌమత్వానికి గొడ్డలిపెట్టు.

ఈ మూడు సమస్యలపై ఆలోచనాత్మక దృష్టి ఏర్పర్చుకోవడం, భారత రాజ్యాంగం ప్రకారం అత్యుత్తమ పౌర సమాజం కోసం కృషి చేయడం ఈనాటి మన కర్తవ్యం.

***

# ముగింపు

జాతీయ స్థాయిలో డా॥ బి.ఆర్. అంబేద్కర్ తన ప్రసంగ వ్యాసమయిన 'కుల నిర్మూలన' ప్రచురించిన 1936 సంవత్సరంలోనే, దక్షిణ భారతదేశంలో బ్రాహ్మణేతర ఉద్యమానికి తెలుగునాట తాత్విక పునాది వేసిన సూర్యదేవర రాఘవయ్య చౌదరి తన 'బ్రాహ్మణేతరోద్యమ తత్త్వము' ప్రచురించడం జరిగింది. ఐతే, అప్పటికే మామిడి వెంకయ్య మొదలు స్వామినేని ముద్దు నరసింహం, ఆత్మూరి నరసింహం, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి మొదలగువారి కృషి ప్రారంభమైంది.

మరోవైపు దేశవ్యాప్తంగా మార్పులు మొదలయ్యి సైన్స్ డిగ్రీ సాధించిన తొలి దళిత మహిళగా దాక్షాయణి వేలాయుధన్ చరిత్ర సృష్టించింది కూడా 1935 లోనే. ఇక్కడ రాఘవయ్య చౌదరి భావాలు సంస్కరణవాదానికే పరిమితం అయినాయి. తెలుగునాట ఆ పరిణామం విప్లవాత్మకం కాడానికి కొంతకాలం పట్టింది. త్రిపురనేని రామస్వామి, సింగమనేని రామయ్య, సరస్వరీ మొదలగువారు సైతం బ్రాహ్మణేత రోద్యమాన్ని నడిపారు. పి.హెచ్. గుప్తా 1921లోనే 'ఆంధ్రరాష్ట్ర అస్పృశ్యతా నివారణ సమావేశం' నిర్వహించిన విషయం మరువరాదు. ఐతే, డా॥ బి.ఆర్. అంబేద్కర్ 'కుల నిర్మూలన' విశిష్టమైనది, విస్తృతమైనదీ.

అప్పటి వరకూ సంస్కరణవాద ఉల్లేఖింపులకే అలవాటుపడ్డ ఉదారవాదాన్ని లాగిలెంపకాయ కొట్టి చెంప చెళ్ళుమనిపించిన గ్రంథం ఇది. అటువంటి మహత్తరమయిన 'కుల నిర్మూలన' ప్రచురించబడి 85 ఏళ్ళు అవుతున్న సందర్భంగా సామాజిక మాధ్యమాల్లో గ్రంథ పరిచయం రాస్తూ, ఈ పుస్తకాన్ని పాఠ్యాంశంగా పెట్టాలనే డిమాండ్ ప్రజాసంఘాలు చేయాలని రాసాను. ఆలోచనాపరులైన మిత్రుల నుంచి కూడా ఆశించిన స్పందన లేదు.

చివరగా 'కులానికి సవాలు' మొదలు, పరిశోధనా వ్యాసం 'భారతదేశ పతనానికి ప్రధాన కారణం : కులం' కానీ, 'ఆంధ్రరాష్ట్ర అస్పృశ్యతా నివారణ సమావేశం' (శత వార్షికోత్సవ సందర్భం 1921-2021) వ్యాసం పునర్ముద్రణ మొదలైనవి స్పష్టమయిన కుల నిర్మూలనా దృక్పథంతో ప్రచురించినవే. కరోనా కరతాళ నృత్యం చేస్తున్న ప్రస్తుత పరిస్థితులలో అనేక అక్షర దోషాలు, సమన్వయ లోపాలు ఉన్నప్పటికీ నా శక్తి మేరకు ఈ సంకలనం ఇలా తీసుకువస్తున్నాను.

డా॥ బి.ఆర్. అంబేద్కర్ 'కుల నిర్మూలన' ప్రతి భారతీయుడూ తప్పనిసరిగా చదివి తీరాల్సిన గొప్ప గ్రంథం అనీ నా అభిప్రాయం. తెలుగులో ఈ గ్రంథాన్ని గురించి జరగాల్సినంత విశ్లేషణాత్మకమయిన చర్చ జరగలేదనే అసంతృప్తే నా ఈ అల్పమయిన ప్రయత్నానికి ఆలంబన అని పేర్కొంటూ, కుల నిర్మూలనోద్యమాలకి ఏ మాత్రంగానైనా ఈ కృతి ఏ రూపంలోనైనా తోడ్పడితే, అంతకుమించిన సార్ధకత నా శ్రమకి మరేదీ లేదని ఇలా సెలవు తీసుకుంటున్నాను. జై భీమ్.

**- సంపాదకుడు**

## ఇతర ప్రచురణలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏమిటి?
3. సాంఘిక తత్వం – వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్థిత్వం–అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం–మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథా కమామీషు (కరపత్రాల సంపుటి)
10. తత్వ విచారణ–తర్క వివేచన
11. కులానికో సవాలు
12. ప్రకృతి–శాస్త్రం–సమాజం
13. హేతువాద దృక్పథం–విధానపర కర్తవ్యం
14. కలాలు కరపత్రాలు
15. పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?
16. శిధిలాక్షరం (కవితా సంపుటి)
17. వ్యవస్థలు – వ్యసనాలు
18. ప్రజా ఉద్యమాల ప్రాతిపదిక
19. తరగతి గది తత్వశాస్త్రం
20. అభివ్యక్తి
21. సాఫల్య జీవులు (ప్రసంగ వ్యాసాలు)
22. భారతదేశ పతనానికి ప్రధాన కారణం : కులం

## ఇంటర్వ్యూలు – పరిచయాలు

23. ధిక్కార స్వరాలు (భావోద్యమకారుల ఇంటర్వ్యూలు)
24. విస్మృత స్వరాలు (కొందరు గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)
25. సద్ధమ్మ స్వరాలు (కొందరు బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)
26. ధీరోదాత్తులు (కొద్దిమంది సామాజిక కార్యకర్తల పరిచయాలు)
27. మరువలేని మనుషులు–మరుపురాని జ్ఞాపకాలు
28. ప్రకృతి శాశ్వత ప్రగతి (సుందర్లాల్ బహుగుణ ఇంటర్వ్యూ)

## సంపాదకత్వం - సంకలనాలు

29. మద్యపానమా? మానవత్వమా? (మద్యం గూర్చి మహిళల వ్యాసాలు)
30. మానవతకు భరోస (మ.వ్య.ప్ర.స. అర్ధ దశాబ్ద్యుత్సవ సావనీర్)
31. సహృదీయం (సహృదయ మిత్రమండలి 15 సం॥రాల సావనీర్)
32. పేదల కలలు (అనువాద కథా సంకలనం)
33. సంస్మృతి (సంక్షోభాలు-సంవాదాలు)
34. ప్రత్యామ్నాయ సినిమాలు (దృక్పథాలు-దృక్కోణాలు)
35. మానవీయ ఆసరా స్వరం : మద్యపాన వ్యతిరేకోద్యమం
36. భారతదేశ ప్రజలమైన మేము... (70 సం॥రాల రాజ్యాంగంపై వ్యాసాలు)
37. చదువు అంటే ఏమిటి? చదువులెందుకు? (విద్యపై విభిన్న భావాలు)
38. ప్రజలు - కళలు (ప్రత్యామ్నాయ ప్రజాకళాతత్వ వ్యాస సంకలనం)
39. ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంస్కర్తలు... (పి.హెచ్. గుప్తా, పునర్ముద్రణ-వ్యాసం)
40. భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం (విధానాలు-వైఖరులు)
41. నవభారత యువ దిక్సూచి.. భగత్సింగ్ (90వ వర్ధంతి ప్రత్యేక వ్యాస సంకలనం)

## అనువాదాలు

42. పురుషుడు-స్త్రీ (చలం ఏకైక ఆంగ్ల వ్యాసం తెలుగులో)
43. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా... (లోక్‌నాయక్ జె.పి. వ్యాసం)
44. శాస్త్రీయ హేతువాద సామ్యవాది: వివేకానంద (దత్తప్రసాద్ దభోల్కర్ రచన)
45. సాలీడు-ఈగ (విలియం లిబ్నిక్ కథ తెలుగులో)
46. నంది మూపురం (డి.డి. కౌశాంబి పిల్లల కోసం రాసిన ఏకైక కథ)
47. ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో... (ఠాగోర్ కవితా విశ్లేషణ)
48. చారిత్రక మహోద్యమం-చంపారన్ సత్యాగ్రహం (శతవార్షికోత్సవ ప్రచురణ)
49. స్వేచ్ఛ-సాంస్కృతిక ఆవశ్యకత (ఎమ్మెన్ రాయ్ రచన)
50. మన విద్యా సమస్య (లాలా లజపతిరాయ్ వ్యాసం)
51. జీవితానికి అర్థం ఏమిటి? (ఆచార్య నరేంద్రదేవ్, లోహియా రచనలు)
52. అభివృద్ధి - ఆదివాసులు - హింస (హిమాంశు కుమార్ రచన)
53. మనిషి-మార్జాలం (కానర్డ్ లోర్నెంజ్ కథ)
54. సినిమా కార్యకర్తల కరదీపిక (చల్తీ తస్వీరే ప్రచురణ)
55. నేను-ప్రజలు-ప్రపంచం (పిఠాపురం యువరాజా ఆత్మకథ)
56. భారతదేశంలో బౌద్ధ పతనం (అంబేద్కర్, రాహుల్జీల రచన)
57. అనారోగ్యాన్ని పండగ చేసుకుందాం... (తమిళ తాత్వికుడు నమ్మాళ్వార్ రచన అనువాదం)